శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొఴి (ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామి అనే మహనీయుల ఉపన్యాసం ఆధారంగా)

| | |
|---|---|
| ఆంధ్రానువాదం | : 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఴగ శింగరాచార్యస్వామివారు |
| ప్రతులు | : 300 |
| ప్రథమ ముద్రణం | : ఏప్రిల్, 2024 |
| ఆవిష్కరణం | : 25-4-2024, |
| ఆవిష్కర్తలు | : పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరి సంపత్ కుమార రామానుజ జీయర్ స్వామివారు |
| ముఖచిత్రం | : సారంగపాణి పెరుమాళ్, కుంబకోణం |

**కీర్తిమూర్తులు, మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి పవిత్రస్మృతిచిహ్నంగా, వారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా ముద్రించబడినది.**

## ప్రాప్తి స్థానము

వి. వి కేశవ అయ్యంగార్,

సెల్ : 9581843434

కే.టి.జి.రామానుజాచార్య,

సెల్ : 9502167187

శ్రీమతే రామానుజాయ నమః

# నివేదనమ్

**ఆథౌ సద్గుణసంస్తుతేః, ద్విజవరప్రస్తావనేనాసకృత్,**
**శిష్యాచార్యసదూపదేశసరణౌ లోకే ౨ వతీర్ణత్వతః,**
**షట్త్వాదాత్మకమంత్రరత్నవివృతౌ దత్తావధానాదపి,**
**శ్రీరామాయణ ముచ్యతే హి  శఠజిద్గీతీ సహస్రోపమమ్.**

1) శ్రీరామాయణంలో ఆరంభంలో మొట్టమొదటలోనే శ్రీరాముని పదహారు గుణాల ప్రస్తావన చేయబడింది. ఆ విధంగానే, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంలోకూడా ప్రారంభంలో "ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్" (సాటి, మేటి లేని విధంగా గొప్పవైన, కళ్యాణగుణాలను కలవాడు) అని భగవంతుని కల్యాణ గుణాల ప్రస్తావన చేయబడింది.

2) శ్రీరామాయణంలో అనేక పర్యాయాలు పక్షుల ప్రస్తావన చేయబడింది. ఇంచుమించుగా అన్ని కాండలలోనూ ఈ ప్రస్తావన కనిపిస్తుంది. ఇదే విధంగా తిరువాయ్ మొళి ప్రబంధంలోకూడా నమ్మాళ్వారులు అనేక దశకాలలో పక్షులద్వారా భగవంతుని దగ్గరకు సందేశాన్ని పంపించడం కనిపిస్తుంది. కనుక ఇందులో కూడా పలుచోట్ల పక్షుల ప్రస్తావన ఉన్నది. ఇక్కడ ద్విజబ్దానికి పక్షులు అనే అర్థం కాకుండా, మునులు అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు . శ్రీరామాయణంలో అన్ని కాండలలోనూ మునుల ప్రస్తావన కనిపిస్తుంది. ఆ విధంగానే తిరువాయ్ మొళి ప్రబంధంలోకూడా చాలా ఫలశ్రుతి పాశురాలలోను, దివ్యదేశాల వర్ణన చేసేటప్పుడు, అక్కడ ఉండే బ్రాహ్మణుల ప్రస్తావన కనిపిస్తుంది.

3) శ్రీరామాయణం గురు శిష్యోపదేశక్రమంలో లోకంలో అవతరించింది. నారదుడు వాల్మీకికి శ్రీరామాయణ గాథను చెప్పగా, వాల్మీకి దానిని గ్రంథస్థం చేసి, కుశలవులద్వారా లోకంలో ప్రచారం చేయించాడు. ఈనాటికీ శ్రీరామాయణంలోని విశేషాలు శిష్యాచార్యక్రమంలోనే పరంపరగా అందుతున్నవి. ఆ విధంగానే, తిరువాయ్ మొళి ప్రబంధాన్నికూడా నమ్మాళ్వారులు ముందు మధురకవులకు, ఆ తరువాత, నాథమునులకు ఉపదేశించగా, అది ఈనాటికీ

శిష్యాచార్యక్రమంలో లోకంలో ప్రచారంలో ఉన్నది. ఈ ప్రబంధంలోని అర్థాలుకూడా శిష్యాచార్యోపదేశక్రమంలోనే అందుతున్నవి.

4) శ్రీరామాయణం శరణాగతిశాస్త్రం అని ప్రసిద్ధి చెందినది. ఇందులోని అన్ని కాండలలోనూ ఈ శరణాగతి తత్వం ప్రతిపాదింపబడింది. ఇందువల్ల ఈ ఇతిహాసంలోని ముఖ్యలక్ష్యం శరణాగతి తత్వ ప్రతిపాదనమే అని చెప్పవచ్చు. ఇదే విధంగా తిరువాయ్ మొళి ప్రబంధంకూడా దీర్ఘశరణాగతి అనే పేరును పొందింది. ఇందులోని అన్ని శతకాలు శరణాగతి తత్వాన్ని ఉపదేశించే, మంత్రరత్నమని పేరు పొందిన ద్వయమంత్రానికి వివరణ రూపాలే అని మన పూర్వాచార్యుల వ్యాఖ్యానం.

ఈ కారణాలవల్ల, శ్రీరామాయణం నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంతో సమానం – అని చెప్పబడుతున్నదికదా.

**పాఠ్యే గేయే చ భోగ్యం, సదసి చ విభునాఽ సక్తిపూర్వం శ్రుతం చ,**
**శ్రీనేతుః దివ్యరూపాసదృశగుణ విభూత్యాదిక స్తోత్రలక్ష్యమ్,**
**విశ్వశ్రేయఃప్రదం, చాప్యహరహ మనుసంధీయమాన శబ్దార్థతత్త్వం**
**శ్రీసీతాదివ్యగాథా సమమిహ శఠజిద్గీతికానాం సహస్రమ్.**

1) శ్రీరామాయణం "పాఠ్యే గేయే చ మధురమ్" అనే విధంగా చేసేటప్పుడు, ఛందోబద్ధం కనుక పాడేటప్పుడు మధురంగా ఉంటుంది. ఆళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంకూడా, మధురమైన శబ్దప్రయోగాలతో, శబ్దాలంకారాలతో కూడినది కనుక చదివేటప్పుడు, సామవేదరూపమైనది కనుక, గానానికి మధురంగా ఉంటుంది.

2) శ్రీరామాయణాన్ని ఆ కావ్యనాయకుడైన శ్రీరామచంద్రుడు సభలో కుశలవులు పాడుతూ ఉండగా చాలా ఆసక్తితో విన్నాడు. తిరువాయ్ మొళి ప్రబంధాన్నికూడా ఆ కావ్యానికి నాయకుడైన శ్రీరంగనాథుడు దివ్యదేవేరులతో కలసి ఆనందంగా ఆలకించాడు అని ఆ ప్రబంధంలోని "వీற்றிరుందు"(4–5) అనే దశక ప్రవేశంలో పూర్వాచార్యులు తెలియజేశారు.

3) శ్రీరామాయణం శ్రీమన్నారాయణ స్వరూపుడైన శ్రీరాముని దివ్యమైన రూపాన్ని, సాటి లేని గుణాలను, విభూతులను మొదలైనవానిని స్తుతించడం లక్ష్యంగా కలిగినది. తిరువాయ్ మొళి ప్రబంధంకూడా, ఆ విధంగానే భగవంతుని దివ్యమైన స్వరూపరూప గుణవిభూతులను స్తోత్రం చేయడమే లక్ష్యంగా కలిగి ఉన్నది.

4) శ్రీరామాయణం ఆదికావ్యం. అందువల్ల అది లోకశ్రేయస్సును కలిగించేదై ఉన్నది. తిరువాయ్ మొళి ప్రబంధాన్నికూడా ఆ విధంగానే లోకశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొనే ఆళ్వారులు అనుగ్రహించారు. లేక, ఇక్కడ విశ్వశబ్దానికి భగవంతుడు అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. ఆళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధాన్ని పాడడంద్వారా భగవంతునకు వాచికమైన కైంకర్యాన్ని చేసి, ఆ స్వామికి ఆనందం కలిగించారు అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

5) భగవద్భక్తులచేత శ్రీరామాయణం ప్రతిదినం పారాయణ చేయబడుతూ, అందులోని అర్థం అనుసంధింపబడుతున్నది. ఆ విధంగానే తిరువాయ్ మొళి ప్రబంధంకూడా ప్రతిదినం పారాయణ చేయబడుతూ, అందులోని అర్థతత్త్వాలు అనుసంధింపబడుతున్నాయి.

ఇందువల్ల, శ్రీరామాయణంతో, వేయి పాశురాలను కలిగిన నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధం సమానమై ఉన్నది.

**అర్థస్య ప్రతిపాదనాద్ద్వయమనోః, సామ్యాచ్చ నేతుః, శ్రుతేః**
**రూపత్వాత్, యతిశేఖరార్యముఖతో వ్యాప్తార్థకత్వాదపి,**
**మాధుర్యేణ జగద్ధితప్రదమహార్థానాం ప్రదానేన చ,**
**శ్రీవాగుక్తికృతేః ప్రయాతి సమతాం రామాయణం నైకధా.**

1) ద్వయమంత్రంలోని అర్థాన్ని ప్రతిపాదించడంవల్ల,
2) శ్రీమన్నారాయణుడే నాయకుడై ఉండడం అనే నాయకత్వసామ్యంచేత,
3) వేదస్వరూపాన్ని కలిగి ఉండడంవల్ల,
4) భగవద్రామానుజులద్వారా వ్యాపింప చేయబడిన అర్థాలను కలిగి ఉండడంవల్ల,

5) శబ్దంలో, అర్థంలో మాధుర్యాన్ని కలిగి ఉండడంవల్ల,

6) లోకానికి హితాన్ని కలిగించే గొప్ప వైన అర్థాలను అనుగ్రహించడంవల్ల,

అనే ఈ ఆఱు విధాలయిన సామ్యాలనుబట్టి, అనేక రీతులలో, శ్రీరామాయణం నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంతో సామ్యాన్ని పొందుతున్నది.

**ఆథౌ సద్గుణసంస్తుతేః, గురువరైః నిత్యానుసంధానతో**
**దృష్టత్వా న్మునినా, పరత్వసులభత్వఖ్యాపనాత్ శ్రీపతేః,**
**ఆర్చామూర్తిసమర్చనస్య కథనా చ్చాచార్యసంకీర్తనాత్**
**ఏతే శ్రీశఠజిత్సహస్రరఘురాట్కావ్యే భవేతాం సమే.**

1) ప్రారంభంలో కళ్యాణగుణాల ప్రస్తావనవల్ల,

2) మన పూర్వాచార్యులచేత ప్రతిదినం అనుసంధానం చేయబడడంవల్ల,

3) మునిచేత దర్శింపబడడంవల్ల,

4) భగవంతుని పరత్వాన్ని, సౌలభ్యాన్ని వర్ణించడంవల్ల,

5) అర్చామూర్తి ఆరాధనను ప్రస్తావన చేయడంవల్ల,

6) ఆచార్యవైభవాన్ని కీర్తించడంవల్ల.

శ్రీరామాయణం, నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి అనే రెండు కావ్యాలు సమానమై ఉన్నాయి.

**వేదే సంకీర్తితత్వాదపి నుతనిగమామాంతార్థ తత్త్వాశయత్వాత్**
**కావ్యత్వాత్ గీతికానాం కలనమయతయా మానిషాదస్తుతిత్వాత్,**
**పీయూషాంభోధిసామ్యాదపి మహిత చతుఃర్వింశతివ్యాపనేన**
**శ్రీమద్రామాయణం ప్రైతి శఠజదుదితశ్రీముఖోక్త్యా సమత్వమ్.**

1) శ్రీరామాయణ గాథ వేదంలో కీర్తింపబడింది వేదమంత్ర రామాయణం అదే పేరుతో కొన్ని సూక్తాలు శ్రీరామాయణ గాథను తెలుపుతున్నవని కూడా పెద్దలు వ్యాఖ్యానించారు. "ధృతేన సీతా మధునా సమక్తా" అనే సూక్తం శ్రీరామాయణాన్ని తెలుపుతున్నది. కలిసంతారణోప నిషత్తులోని "హరే రామ హరే రామ" అనే మంత్రం సుప్రసిద్ధమైనది. ఆ విధంగానే

తిరువాయ్ మొళి ప్రబంధం కూడా "సహస్ర పరమా దేవీ శత మూలా శతాంకురా" అనే శ్రుతివాక్యంలో ప్రస్తావింపబడింది.

2) శ్రీరామాయణంలో వేదాంతార్థాలు వివరింపబడ్డాయి. వేదమే శ్రీరామాయణంగా అవతరించింది కదా. ఆ విధంగానే తిరువాయ్ మొళి ప్రబంధం కూడా "నమామ్యహం ద్రావిడ వేదసాగరమ్" అని వేదంగా కీర్తింపబడుతున్నది. ఇది ఈ సామవేద సారమని ప్రసిద్ధి.

3) శ్రీరామాయణం ఆదికావ్యంగా లోకంలో ప్రసిద్ధి చెందింది. తిరువాయ్ మొళి ప్రబంధం కూడా ఒక కావ్యమే. అందులో భగవానుడు నాయకుడు. నాయకి నమ్మాళ్వారులు.

4) శ్రీరామాయణం శ్లోకాలతో కూర్చబడింది. ఇవి గానానికి అనుకూలమైనవి. తిరువాయ్ మొళి దివ్య ప్రబంధం కూడా గానానికి అనుకూలమైన పాశురాలతో కూర్చబడింది.

5) శ్రీరామాయణం "మా నిషాద " అనే శ్లోకంతో ప్రారంభం అవుతున్నది. ఈ పదం శ్రీనివాసుని తెలుపుతుంది అని పెద్దలు వ్యాఖ్యానించారు. అందువల్ల శ్రీరామాయణం ఒక విధంగా శ్రీనివాస వైభవాన్ని తెలుపుతున్నది. ఇదేవిధంగా తిరువాయ్ మొళి ప్రబంధం కూడా శ్రీనివాస వైభవాన్ని తెలుపుతున్నది. ఆ ప్రబంధంలో ఆళ్వారులు ద్వయమంత్రార్థాన్ని శ్రీనివాసుని విషయంలో అనుసంధించారు.

6) "వందే రామాయణార్ణవమ్"అనే శ్రీరామాయణం ఒక అమృత సముద్రంగా చెప్పబడుతున్నది. ఆ విధంగానే తిరువాయ్ మొళి ప్రబంధం కూడా "ద్రావిడ వేద సాగరం "అని ఒక సముద్రం గా కీర్తించబడుతున్నది.

7) శ్రీరామాయణం 24 వేల శ్లోకాలతో విస్తరించింది. అంటే ఇందులో 24వ సంఖ్యకు ప్రాధాన్యం ఉన్నది. ఆ విధంగా అనే తిరువాయి మలి ప్రబంధం కూడా 24 అనే సంఖ్యను ప్రధానంగా కలిగి ఉన్నది . ఏ విధంగా అంటే ఈ ప్రబంధాన్ని శ్రీకృష్ణ సూరి అనే పూర్వాచార్యులు 24 వేల గ్రంథ పరిమితులో వ్యాఖ్యానం చేశారు.

ఈ విధంగా ఉండే ఎన్నో సామ్యాలను బట్టి శ్రీరామాయణం తిరువాయ్ మొళి దివ్య ప్రబంధంతో సామ్యాన్ని పొందుతున్నది.

★★★★★

భారతీయులందరికీ పరమ ప్రమాణం వేదం. భారతదేశంలోని ఏ కళ అయినా, ఏ శాస్త్రం అయినా, ఇంకా ఏ విధమైన విద్య అయినా, వేదాన్ని మూలంగా కలిగినది అని భారతీయుల విశ్వాసం. ఆ వేదం – ఋగ్వేదం, యజుర్వేదం,, సామవేదం, అధర్వణ వేదం అని నాలుగు విధాలుగా ఉన్నది. ఈ వేదాలు అపౌరుషేయాలు, నిత్యమైనవి, ఏదోషం లేనివి, అనంతమైన విస్తృతిని కలిగినవి.

ఈ వేదాన్ని వివరించడం కోసంగానే స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు ఆవిర్భవించాయి. వేదాన్ని మూలంగా కలిగినవి కనుకనే ఇవి ప్రమాణాలుగా అంగీకరింపబడుతున్నాయి.

భగవంతుడు లోకోద్ధరణ కోసం అనేక విధాలయిన అవతారాలను ఎత్తాడు. ఆ విధంగానే, వేదం కూడా లోకంలో ఉండేవారి హితంకోసం అనేక అవతారాలను ఎత్తింది. భగవానుడు శ్రీరాముడుగా అవతరించగా, వేదం శ్రీరామాయణంగా అవతరించినది. భగవానుడు అర్చావతారాలను పరిగ్రహించినట్లే, వేదం దివ్యసూరుల మూలంగా దివ్య ప్రబంధ రూపంలో అవతరించినది. ఆళ్వార్లు అనబడే పరమ భక్తుల ద్వారా భగవానుడు వేదాన్ని దివ్యప్రబంధాల రూపంలో అవతరింప చేశాడు.

అళ్వారుల ద్వారా లోకంలో అవతరించిన దివ్యప్రబంధాలు 24. వాటిలో, నమ్మాళ్వారులు అనుగ్రహించిన నాలుగు ప్రబంధాలు అంగి ప్రబంధాలు అని, తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన ఆరు ప్రబంధాలు అంగప్రబంధాలు అని, మిగిలిన ఆళ్వారులు అనుగ్రహించిన ప్రబంధాలు ఉపాంగ ప్రబంధాలు అని మన పూర్వాచార్యులు నిర్ణయించారు. నమ్మాళ్వారులు అనుగ్రహించి నాలుగు ప్రబంధాలలో కూడా, చివరి ప్రబంధం అయిన తిరువాయ్ మొழி విలక్షణమైనది. ఇది సామవేద సారంగా ప్రసిద్ధి చెందినది.

తిరువాయ్ మొழி ప్రబంధంలోని సూక్తులలో అనేక శ్రుతుల అర్థాలే కాకుండా, శ్రీరామాయణం, శ్రీవిష్ణుపురాణం, శ్రీమద్భగవద్గీత మొదలైన వేదోపబృంహణాలలోని అర్థాలు గోచరించే వైనాన్ని మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో, ఆయా సందర్భాలలో పలు శ్రీరామాయణ విష్ణు పురాణ భగవద్గీతాది గ్రంథాల నుండి ఎన్నో ప్రమాణాలను ఉట్టంకించి వివరిస్తూ, నిరూపించారు.

విశేషించి శ్రీరామాయణానికి, తిరువాయ్ మొழி ప్రబంధానికి మధ్య ఉండే సామ్యాలు అనేక విధాలుగా ఉన్నాయి. ఈ రెండు ప్రబంధాలు ద్వయమంత్రార్థ ప్రతిపాదకాలు.. ఈ విషయాన్ని మన పూర్వాచార్యులు పలువురు పలు రీతులలో సప్రమాణంగా నిరూపించారు. నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానం ఆరంభంలో, నమ్మాళ్వారులకు సీతాదేవితో, లక్ష్మణస్వామితో, భరతునితో, శత్రుఘ్నునితో ఉండే సామ్యాలను ప్రస్తావించి వివరించారు. ఎన్నో శ్రీరామాయణ శ్లోకాలను పలు సందర్భాలలో ప్రమాణాలుగా ఉదాహరించి, వాటిని ఆ యా అళ్వార్ల సూక్తులకు అనుగుణంగా వ్యాఖ్యానించి, ఈ రెండు ప్రబంధాల మధ్య ఉండే అర్థసామ్యాన్ని స్పష్టం చేశారు.

గత శతాబ్దిలో, ఉభయ వేదాంతాలలోనూ సాటి లేని మేటి విద్వాంసులుగా, గొప్ప ఉపన్యాసకులుగా ప్రసిద్ధి చెందిన ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్య స్వామివారు "శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி" అనే అంశాన్ని ఆధారంగా చేసుకుని, ఒక చక్కని ఉపన్యాసాన్ని అనుగ్రహించారు. ఉపన్యాస సారమే ప్రస్తుతం ప్రకాశింప చేయబడే గ్రంథం. ఈ గ్రంథం అస్తిక జనులకు ఆనందాన్ని కలిగించగలరని నమ్ముతున్నాను.

"వాగమృతవర్షి" అనే ప్రసిద్ధమైన బిరుదును కలిగిన శ్రీమాన్ వరదాచార్య స్వామివారి మధురమైన ఉపన్యాసశైలి జగత్ప్రసిద్ధమైనది. అందువల్ల, వారి ఉపన్యాస రూపంగా వెలువరింపబడే ఈ గ్రంథం కూడా అమృతోపాయనంగా ఉంటుంది అని అనడంలో ఏ సందేహం లేదు. దీనిని ఆస్తికులందరు ఆనందిస్తారని నమ్ముతున్నాను. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో సహకరించిన శ్రీమాన్ కేశవ అయ్యంగార్

స్వామివారికి అనేక మంగళాశాసనాలు. దీని ప్రచురణకు కావలసిన ఆర్థిక భారాన్ని వహించిన శ్రీమాన్ కే.టి.జి.రామానుజాచార్య స్వామివారికి, శ్రీమాన్ కేశవ అయ్యంగార్ స్వామివారికి అనేక మంగళాశాసనాలు సమర్పించుకుంటున్నాను.

కీర్తిమూర్తులు, అస్మత్పితామహవరేణ్యులు, మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్, ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి పవిత్రస్మృతిచిహ్నంగా, వారి ఆజ్ఞానుసారంగా, గడచిన 25 సంవత్సరాలుగా, వారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా, ఉభయ వేదాంత సభలు నిర్వహింపబడుతన్నాయి. ఈ సభలు, ఇంతకుముందు దాసుని పితృచరణులు, కీర్తి మూర్తులు, న్యాయవేదాంత విద్వాన్, ఉభయ వేదాంత భాస్కర ఉ. వే. శ్రీమాన్ రంగాచార్యస్వామివారి పర్యవేక్షణలో జరిగేవి. ఈ సంవత్సరం అభినవ భూతపురిగా ప్రసిద్ధి చెందిన నరసాపురం నగరంలో జరిగే ఆదికేశవస్వామి బ్రహ్మోత్సవాలలో, ఆ స్వామివారి ముఖోల్లాసరూప కైంకర్యంగా, ఏప్రిల్ 24 25 26 వ తేదీలలో జరుగుతున్నాయి. ప్రతి సంవత్సరం, ఈ సభలలో ఒక సంప్రదాయ గ్రంథాన్ని ముద్రించి, ప్రకాశింపజేయడం పరిపాటిగా వస్తున్నది. ఆ క్రమంలో ,ఈ సంవత్సరం, ఈ “శ్రీరామాయణం తిరువాయ్ మొழி” అనే గ్రంథం ప్రచురింపబడుతున్నది. స్వస్తి.



**భాగవతదాసుడు,**

**ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు**

★★★★★

## శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி

**లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్,**

**అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్**

ఈ శ్లోకంద్వారా పూర్వాచార్యపరంపర అనుసంధింప బడుతున్నది. ఈ పరంపరలో, లక్ష్మీనాథునినుండి ఆరంభించి ఉండే ఆచార్యులైన భగవంతుడు, లక్ష్మీదేవి, విష్వక్సేనుడు అనే ముగ్గురు వైకుంఠంలో ఉండేవారు. ఆ తరువాత నమ్మాళ్వార్లనుండి ఆరంభమై కొనసాగే గురుపరంపర ఈ లోకంలో అవతరించినది. నమ్మాళ్వార్లనుండి ఆరంభించి శ్రీమణవాళ మహామునులవరకు ఉండే గురుపరంపర ఈ లోకంలో ఉండే ఆచార్యపరంపర. శ్రీ మణవాళ మహామునులకు తరువాత నేటివరకు అవతరించిన ఎంతోమంది పూర్వాచార్యులు ఆచార్యస్థానాన్ని అలంకరించి, విశిష్టాద్వైత సంప్రదాయాన్ని ఈనాటివరకు పరిరక్షించి, ప్రచారం చేస్తున్నారు శ్రీవైష్ణవసంప్రదాయ రహస్యార్థాలను పరిరక్షించి, ఆశను కలిగినవారికి అందరికీ అనుగ్రహించి, లోకోజ్జీవనాన్ని కలిగిస్తున్నారనే విషయం అందరికీ అపరోక్షం. ప్రస్తుత వ్యాసశీర్షికలోని విషయం – "శ్రీరామాయణమ్ –తిరువాయ్ మొழி" అనేది.

శ్రీవైష్ణవసంప్రదాయాన్ని పాడు చేయాలని చిరకాలంగా ఎంతోమంది ఎన్నో పాట్లు పడ్డారు. అందులో చోళరాజు ఒకడు. అతనికి అవ్యపదేశ్యుడు అని పేరు. అంటే, ఉచ్చరించదగని పేరును కలవాడు– అని అర్థం. అంతటి నీచుడు, అతడు, అంతటి తామసుడు, అతడు. అతడు వైష్ణవాలయాలను అన్నిటిని పడగొట్టి ధ్వంసం చేయడం ప్రారంభించాడు. అతని ఒక కుమారుడు ఉండేవాడు. అతడు తండ్రివలె కాకుండా, సద్గుణ సంపన్నుడు. మహాపాపిష్ఠివాడైన హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు పుట్టినట్టుగా, పరమనీచుడైన ఈ చోళప్రభువుకు మంచి గుణాలు కలిగిన ఒక

పుత్రుడతడు. అతడు తండ్రి చేసే నీచమైన పనిని చూసి, "అయ్యా! ఎందుకు నీవు ఈ విధంగా వైష్ణవాయాలను పడగొడుతున్నావు? ఈ విధంగా ఆలయాలను పాడు చేస్తే, వైష్ణవమతం లేకుండా పోతుందని అనుకుంటున్నావా? నీ భావం సరి కాదు. వాస్తవమైన విషయం ఏమిటో నీకు తెలుసునా? వాల్మీకిమహర్షి రచించిన శ్రీరామాయణం, నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొ*ழி* అనే రెండు బలిష్టమైన ప్రమాణాలు ఉన్నంతకాలం శ్రీవైష్ణవసంప్రదాయాన్ని పాడు చేయడానికి ఎవరికీ సాధ్యం కాదు. ఇది నిశ్చయం. రాళ్లతో, మట్టితో, ఇటుకలతో కట్టిన కోట ఈ మతానికి రక్షించే కోట కాదు. దీనిని రక్షించే శాశ్వతమైన, సుస్థిరమైన, అచంచలమైన కోటలు ఏమంటే, శ్రీరామాయణం, తిరువాయ్ మొ*ழி* అనే ఈ రెండు ప్రమాణాలేసుమా!". అని అన్నాడు.

అర్థాన్ని గమనించి చూసినప్పుడు, శ్రీరామాయణాన్ని అనుసరించి తిరువాయ్ మొ*ழி* ప్రబంధం ఉన్నదా? తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని అనుసరించి శ్రీరామాయణం ఉన్నదా? దానికి ఉపష్టంభకమైన ప్రమాణం ఇదా? దీనికి అవలంబకమైన ప్రమాణం అదా? అని ఆశ్చర్యపడే రీతిలో ఈ రెండు ప్రమాణాలు ఉంటాయి. ఈ రెండిటినీ పురస్కరించుకునే మన సంప్రదాయంలో సంప్రదాయరహస్యార్థ నిర్ధారణను మన పెద్దలు చేశారు. ఈ రెండు మహాప్రబంధాలకు మధ్య ఉండే సామ్యాలనుకొంత యథాజ్ఞానం గమనిద్దాం.

శారీరకమీమాంసా గ్రంథాన్ని రచించే వేదవ్యాసులు ముందుగా గ్రంథోద్దేశ్యాన్ని చెప్పారు. తరువాత, ఉద్దేశ్య లక్షణం చెప్పారు. తరువాత, ఆ లక్షణాన్ని పరీక్షించారు. ఈ విధంగా ఉద్దేశ్యం, లక్షణం, పరీక్ష అనేది ఒక విశిష్టక్రమం. ఇది శాస్త్రకారుల అనుభవక్రమం. ఒక గ్రంథంలో ఏ విషయాన్నిగూర్చి చెప్పబోతున్నారో, అది ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యాన్ని ఇదమిత్థంగా నిరూపించేది లక్షణం.

ఆ విధంగా చెప్పబడిన లక్షణం ఉద్దేశంలో పూర్తిగా అన్వయిస్తుందా? అన్వయించదా? అని తరువాత విషయ విచారణ చేస్తారు ఇది పరీక్ష అందుచేత, మొదట చెప్పబడేది ఉద్దేశ్యం. తరువాత చెప్పబడేది లక్షణం. తరువాత చేయబడేది లక్షణ పరీక్ష.

అందువల్లనే వేదవ్యాసులు శారీరకమీమాంసాగ్రంథంలో ముందుగా "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే సూత్రంతో ఉద్దేశ్యమైన బ్రహ్మను నిర్దేశించారు. అంటే, "ఈ బ్రహ్మనుగూర్చి లక్షణాన్ని చెప్పి, దానిని విచారించబోతాను"– అని తెలుపగోరినవారై, ముందుగా బ్రహ్మశబ్దంతో వస్తునిర్దేశాన్ని చేశారు. తరువాత, "ఈ విధంగా నిర్దేశింపబడిన బ్రహ్మకు ఏది లక్షణం? " అనే విషయాన్ని "జన్మాది అస్య యతః" అనే రెండవ సూత్రంతో తెలిపారు. జగజ్జన్మాదికారణత్వం బ్రహ్మలక్షణం– అని తెలియజేశారు. దీనికి తరువాత ఉండే భాగంలో ఈ విధంగా చెప్పిన బ్రహ్మలక్షణాన్ని వేదవ్యాసులు విచారించారు. అందుచేత, ముందుగా వస్తునిర్దేశం నామ్నా పదార్థసంకీర్తనం. తరవాత లక్షణం, అంటే, నిర్దేశింపబడిన వస్తుస్వరూపాన్ని నిర్వచించడం, ఆ తరువాత, ఆ వస్తునిర్వచనాన్ని పరీక్షించడం– అనేది క్రమం. అందుచేత, "శాస్త్రయోనిత్వాత్" అనే మూడవ సూత్రంనుండి వేదవ్యాసులు ఏమి వర్ణించారు? ఉక్తలక్షణానికి పరీక్షను చేశారు. ఈ విధంగా జగజ్జన్మాదికారణంగా చెప్పబడిన బ్రహ్మను ఏ విధంగా తెలియడం? ప్రత్యక్షం ద్వారా తెలియవచ్చునా? లేక, అనుమానం ద్వారా తెలియవచ్చునా? లేక, లౌకికమైన శబ్దాలద్వారా తెలియవచ్చునా? అంటే ప్రత్యక్షంద్వారా తెలియడం వీలు కాదు అనుమానం ద్వారా తెలియడం సాధ్యం కాదు. లౌకికమైన శబ్దాల ద్వారా తెలియడం సాధ్యం కాదు. కేవల వేద శబ్దాలద్వారానే బ్రహ్మను తెలియడం సాధ్యం అవుతుంది– అనే విషయాన్ని "శాస్త్రయోనిత్వాత్" అనే మూడవ సూత్రంతో వ్యాసులు తెలియజేశారు.

"శాస్త్రయోనిత్వాత్" అంటే, "శాస్త్రప్రమాణకత్వాత్", అంటే, బ్రహ్మం శాస్త్రమనబడే వేదాన్ని ప్రమాణంగా కలిగినది కనుక– అని అర్థం. అందుచేత, వేదవాక్యాలే బ్రహ్మను తెలియడంలో మూలప్రమాణాలు. ఆ వాక్యాలు ఏవి? అంటే, "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి" అనే వాక్యాలు.

ఆ విధంగానే శ్రీవైష్ణవసిద్ధాంతానికి ఉన్నతమైన ప్రమాణం ఏమిటంటే, రెండు ఉన్నతమైన ప్రమాణాలు ఉన్నాయి. అవి, శ్రీరామాయణం, తిరువాయ్ మొழி అనేవి. వాల్మీకి రామాయణాన్ని అనుసరించి మన పూర్వాచార్యులు తిరువాయ్ మొழிలోని ఎన్నో సందర్భాలో అర్థనిర్ణయాన్ని చేశారు. ఈ రెండు ముఖ్యమైన, ఉన్నతమైన ప్రమాణాలను అనుసరించి, మన పూర్వచార్యులు మన సంప్రదాయవిశిష్టరహస్యార్థాలను నిష్కర్షించారు. ఆ విషయాన్ని సంగ్రహంగా ప్రస్తుతం గమనిద్దాం.

రెండు విషయాలు కలిపి పరిశీలించాలి అంటే, ఆ రెండిటి మధ్య ఉండే సామ్యాలను, వైలక్షణ్యాలను, అంటే, ఒకదానికంటే ఇంకొకదానికి ఉండే ఉందే హెచ్చు తగ్గులను గమనించాలి. అందుచేత, ఇప్పుడు, శ్రీరామారాయణం, తిరువాయ్ మొழி– అనే రెండు గ్రంథాలను గూర్చి ప్రస్తావించాలంటే, ఈ రెండిటి మధ్య సామ్యాలు ఉన్నాయని నిరూపించాలా? లేక, ఈ రెండిటిలో ఒకదాని కంటే ఇంకొకటి విలక్షణమైనది అని చెప్పాలా? అంటే, ముందుగా ఈ రెండిటి మధ్య ఉండే సామ్యాలను గమనిద్దాం.

ఈ రెండిటి మధ్య ఉండే పలు సామ్యాలను మన పూర్వాచార్యులు నిరూపించారు. వాటిలో రెండిటిని, మూడిటిని మాత్రం మనం ఇక్కడ గమనిద్దాం. తరువాత, ఈ రెండిటి మధ్య ఉండే హెచ్చుతగ్గుల అనే విషయాన్ని గమనిద్దాం. ఈ

విషయాన్ని కూడా మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానగ్రంథాలలో నిరూపించారు. ఆ తరువాత, శ్రీరామాయణంలోని సారార్థాలను తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని ఏ ఏ సందర్భాలలో మన పూర్వాచార్యులు ఏ విధంగా అన్వయించి, నిరూపించి, చూపించారు? అనే విషయం కూడా సంగ్రహంగా గమనిద్దాం.

శ్రీరామాయణం– తిరువాయ్ మొ*ழி* ప్రబంధాల మధ్య ఉండే కొన్ని సామ్యప్రకారాలు

**"వ్యాసం వశిష్టనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్,**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్"**

అనేది వ్యాసమహర్షిని స్తుతించే ఒక శ్లోకం. శ్రీవిష్ణుసహస్రనామాధ్యాయానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే పరమాచార్యులైన శ్రుపరాశర భట్టర్ ఈ శ్లోకాన్ని ఉదాహరించారు. దీనిని ఎక్కడ, ఎందుకు ఉదాహరించారో, ఆ సందర్భాన్ని, కారణాన్ని ముందుగా గమనిద్దాం. భట్టర్ తమ భాష్యంలో ముందుగా "సహస్రనామ్నా మధ్యాయః ఉపాదేయతమో మతః"– సహస్రనామాధ్యాయాన్ని అందరూ ఆదరించాలి– అని అన్నారు. ఎందుకు ఆదరించాలి? అనే ప్రశ్నకు వారు ఆరు కారణాలను సమాధానంగా తెలియజేశారు. అవి ఏవి? అంటే,

1)మహాభారతసారత్వాత్,

2)ఋషిభిః పరిగానతః,

3)వేదాచార్యసమాహారాత్,

4) భీష్మోద్దిష్ట మతత్వతః,

5)పరిగ్రహాతిశయతః,

6)గీతాశాస్త్రైక్యతశ్చ నః

“సహస్రనామ్నామధ్యాయ ఉపాదేయతమో మతః” అనేది భట్టర్ వచనం.

ఇందులో మొదటి కారణం “మహాభారత సారత్వాత్” అనేది. అంటే, సహస్రనామాధ్యాయం మహాభారత సారం– అని అర్థం.

వెంటనే ఇక్కడ మనకు ఒక ప్రశ్న కలుగుతుంది. మహాభారతం ప్రమాణం అయితే కదా, మహాభారతసారమైన సహస్రనామాధ్యాయం ప్రమాణం అవుతుంది– అనేది ఆ ప్రశ్న. దీనికి సమాధానంగా భట్టర్ ఏమని అన్నారంటే, ఈ మహాభారతాన్ని రచించినవారు ప్రామాణికులైన వేదవ్యాసులు కదా– అని సమాధానం చెప్పారు. వెంటనే ఇంకొక సందేహం కలుగుతుంది. సరే బాగుంది, వేదవ్యాసమహర్షి ప్రామాణికులు– అని ఎవరు చెప్పారు? వారు ప్రామాణికులు అని అనడానికి ఏమి ఆధారం? అనేది మళ్లీ ఒక ప్రశ్న.

ఈ ప్రశ్నకు సమాధానంగానే పైన ఉదాహరించిన “వ్యాసం వశిష్టనప్తారమ్” ఇత్యాది శ్లోకాన్ని భట్టర్ ఉట్టంకించారు. వేదవ్యాసులు శుకాచార్యులకు తండ్రి, పరాశరమ మహర్షికి కుమారుడు, శక్తిమహర్షికి పౌత్రుడు, వశిష్టునకు మునిమనువడు కదా. ఇటువంటి అతిశయం వ్యాసులకు ఉన్నందున వారు రచించిన మహాభారతం ప్రమాణం అవుతున్నది, అందులో సారమైన సహస్రనామాధ్యాయం ఉపాదేయతమం అవుతున్నది –అని భట్టర్ సమాధానం చెప్పారు.

వెంటనే ఇక్కడ మళ్ళీ ఇంకొక ప్రశ్న ఏర్పడింది. పై శ్లోకంలో “వ్యాసం వశిష్టనప్తారమ్” అని ఉన్నది కదా. మరి, వశిష్టులు ప్రామాణికులు అయితే కదా, వారి మునిమనుమడు అయిన వ్యాసులు ప్రామాణికులు అవుతారు! –అని ఇక్కడ సందేహం. దీనికి సమాధానంగా భట్టర్ “స్వవచనేన క్షత్రియం విశ్వామిత్రం బ్రాహ్మణీకృతవతః” – తాను పలికిన ఒక్క మాటతో క్షత్రియుడైన విశ్వామిత్రుని బ్రాహ్మణునిగా చేసిన గొప్పతనం వశిష్ట మహర్షికి ఉన్నది, కనుక, వారు ఎంత

ప్రామాణికులు, ఎంత గొప్పవారు! – అని భట్టర్ అన్నారు. ఈ విధంగా, వశిష్టులు గొప్పవారు కనుక, వారి మునిమనులు అయిన వ్యాసులు గొప్పవారు. శక్తి గొప్పవారు కనుక, వారి మనుమలు అయిన వ్యాసులు గొప్పవారు. పరాశరమహర్షి గొప్పవారు కనుక, వారి కుమారుడైన వ్యాసమహర్షి గొప్పవారు. శుకులు గొప్పవారు కనుక, వారి తండ్రి అయిన వ్యాసమహర్షి గొప్పవారు. ఈ విధంగా వ్యాసమహర్షికి పలు విధాలుగా గొప్పతనం చెప్పి నిరూపించినట్లే, శ్రీరామాయణానికి, తిరువాయ్ మొ*ழி* ప్రబంధానికి కల గొప్పతనాన్ని పలు విధాలుగా మన పూర్వాచార్యులు నిరూపించారు. ఈ రెండు ఏ విధంగా, ఎంత ఉన్నతమైన ప్రమాణాలు? అనే విషయాన్ని నిరూపించారు. వాల్మీకి మహర్షికి గల గొప్పతనం ఏమి? ఆ మహర్షిచే రచింపబడిన శ్రీరామాయణానికి కల గొప్పతనం ఏమి? నమ్మాళ్వార్లకు గల గొప్పతనం ఏమి? వారు అనుగ్రహించిన తిరువాయ్ మొ*ழி* దివ్యప్రబంధానికి కల గొప్పతనం ఏమి? అనే విషయాన్ని నిరూపించారు. శ్రీరామాయణం వాల్మీకి మహర్షిచేత అసింపబడినది కనుక, గొప్పతనాన్ని కలిగినది. తిరువాయ్ మొ*ழி* ప్రబంధం నమ్మాళ్వార్ల చేత అనుగ్రహింపబడినది కనుక, గొప్పతనాన్ని కలిగినది. ఈ విధంగా గొప్పతనాలను కల రామాయణాన్ని, తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని పురస్కరించుకొని, మన సంప్రదాయరహస్యార్థాలను చక్కగా గ్రహించి నిర్ణయం చేసుకోవచ్చు– అని అంటారు, మన పెద్దలు.

వాల్మీకి భగవానునకు కల గొప్పతనం ఏమి? అనేది ఇప్పుడు ప్రశ్న. వ్యాసమహర్షి గొప్పవారు. ఆ వ్యాసమహర్షి భాగవతం రచించేటట్లు ఉపదేశించేసినవారు ఎవరో తెలుసునా? నారదమహర్షి. ఆ నారద మహర్షికి తండ్రి ఎవరు? సాక్షాత్తు చతుర్ముఖ బ్రహ్మ. ఆ బ్రహ్మచే ప్రశంసింపబడినవారు ఎవరు తెలుసునా? వారే వాల్మీకి మహర్షి. ఈ వృత్తాంతవివరాలను కొంచెం గమనిద్దాం.

వ్యాసమహర్షి సపాదలక్షాత్మకమైన మహాభారత గ్రంథాన్ని రచించిన తరువాత, మనసులో ఏదో కొరతతో, చింతతో ఒక నదీతీరంలో బాధపడ సాగారు. అక్కడికి నారద మహర్షి వచ్చారు. వ్యాసమహర్షి విచారంగా ఉండడాన్ని చూచి ఈ విధంగా అన్నారు. "వ్యాసమహర్షీ! మీరు వేదసారమని చెప్పదగిన మహాభారతాన్ని సపాద లక్షశ్లోక రూపంగా రచించారు కదా. ఒక నాలుగు శ్లోకాలను రచిస్తేనే, లోకంలో తనను తాను గొప్పగా భావిస్తాడు, అహంకరిస్తాడు కదా. అటువంటిది మీరు ఒక లక్ష, 25 వేల శ్లోకాలను కల మహాభారతాన్ని రచించారు. ఎందుకు మీది విధంగా చింత పడుతున్నారు?" అని నారద మహర్షి వ్యాసమహర్షిని ప్రశ్నించారు. అప్పుడు వ్యాసులు "నా విచారానికి కారణం ఏమో నాకే తెలియడం లేదు. ఎందుకు నా మనసులో చాలా కొరతగా ఉన్నదో, నేనెందుకు విచారపడుతున్నానో, ఎంత ఆలోచించినా తెలియడం నాకు లేదు." అని వ్యాసులు అన్నారు అప్పుడు నారద మహర్షి సమాధానం పలుకుతూ, "ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!, యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్" అనే విధంగా మీరు రచించిన భారతానికి కల గొప్పతనం ఉన్నది. ఈ భారతంలో చెప్పబడిన విషయాలే ఇక ఎక్కడైనా చెప్పబడి ఉంటాయి. ఇక్కడ చెప్పబడని విషయాలు ఏమీ ఇక ఏ గ్రంథంలోనూ చెప్పబడవు. అన్ని శాస్త్రాలలో చెప్పబడిన విషయాలు అన్నీ ఈ భారతంలో అంతర్భవించి ఉన్నాయి. ఈ మహాభారతంలో ఏ విషయం అయినా చెప్పబడకపోతే, ఇక అది మరి ఏ గ్రంథంలోను కనుపించే అవకాశం లేదు. ఈ విధంగా మహాభారతం సర్వార్థ ప్రతిపాదకం. ఇంతటి గొప్పతనాన్ని కలిగిన మహాభారతాన్ని రచించినప్పటికీ ఓ వ్యాసమహర్షీ! మీరు ఇంకా ఎందుకు విచారంతో ఉన్నారో తెలుసునా? ఆ కారణాన్ని చెబుతాను వినండి. మీరు భారతాన్ని ఆరంభించేటప్పుడు ఏమి చెబుతానని ఆరంభించారు? "నారాయణం నమస్కృత్య"

అని నారాయణుని నమస్కరించి, ఆరంభించి, ఆ నారాయణుని వృత్తాంతాన్ని వర్ణిస్తానని అన్నారు. "కృష్ణచరిత్రను వర్ణిస్తానని చెప్పి ఆరంభించి ఆ కృష్ణుని చరిత్రను చక్కగా వర్ణించకుండా, అక్కరలేని వృత్తాంతాలను ఎన్నిటినో మహాభారతంలో వర్ణించారు. ఏమి చెబుతానని ప్రతిజ్ఞ చేశారో, ఆ విషయాన్ని చెప్పకుండా, వేరు విషయాలను చెప్పారు చెప్పవలసిన విషయాన్ని చెప్పకపోవడం, చెప్పనక్కర లేని విషయాలను మాటిమాటికి చెప్పడమే మీ విచారానికి కారణం." అని అన్నాడు, నారదుడు. "నారాయణ కథామిమామ్" అని నారాయణుడైన శ్రీకృష్ణుని కథను వర్ణిస్తానని ఆరంభించినా, వ్యాసుడు తాను రచించిన మహాభారతంలో శ్రీకృష్ణుని చరిత్రను చాలా కొంచెంగానే చెప్పారు. ఎవరెవరు యుద్ధంలో ఎవరెవరిని వధించారు, ఎవరెవరికి ఎవరెవరు పుత్రులుగా జన్మించారు– అనే ఈ విధమైన వివరాలనే ఎక్కువగా భారతంలో వ్యాసులు తెలియజేశారు. ఈ విధంగా చెప్పవలసినదానిని చెప్పకుండా, చెప్పనక్కరలేని విషయాలను చెప్పడం అనేది గ్రంథానికి చాలా కొరతను కలిగిస్తుంది. అందువల్ల వ్యాసునకు ఆత్మలో అసంతృప్తి కలిగింది. ఈ విషయాన్ని నారదుడు తెలియజేస్తూ, " మీరు, మీకు కలిగిన ఈ అసంతృప్తి తీరేటట్లుగా, భాగవతాన్ని చెప్పండి. మీ మనస్సు శాంతపడుతుంది" అని నారదుడు వ్యాసునకు ఉపదేశించాడు. ఈ విధంగా నారదునిచేత ఉపదేశింపబడిన, ఉత్తముడైన వ్యాసమహర్షి తమ మనసులోని కొరత తీరేటట్టుగా భాగవతాన్ని రచించారు– అనేది సంప్రదాయం. ఈ విషయాన్ని నాయనార్ ఆచార్యహృదయం అనే గ్రంథంలో " రామాయణమ్, నారాయణ కథ– ఎన్ఱు తొడంగి, గంగాగాంగేయసంభవాది అసత్కీర్తనమ్ పణ్ణిన ఎచ్చిల్ వాయాలే" అని అన్నారు. ఈ విధంగా వేద వ్యాసునకు మహాభాగవతార్థాలను తెలియజేసిన ఉత్తములు– నారదమహర్షి. ఆ నాదునకు

తండ్రి బ్రహ్మ. ఆ బ్రహ్మచే ప్రశంసింపబడిన గొప్పతనాన్ని కలిగినవారు ఎవరంటే, వాల్మీకి మహర్షి.

వాల్మీకి మహర్షి ఆశ్రమానికి సత్యలోకంనుండి బ్రహ్మ వచ్చాడు. శాస్త్రప్రకారంగా ఆ మహర్షికి వాల్మీకి మహర్షి గౌరవ మర్యాదలను చేశాడు. బ్రహ్మకు ఎదురుగా వాల్మీకి మహర్షి వినయంగా నిలుచున్నాడు. "బ్రహ్మ గొప్పతనం ఏమి? నేనేమి? ఈ బ్రహ్మదేవుని ముందు నిలుచుకునే అర్హతకూడా నాకు లేదుకదా"– అని వాల్మీకిమహర్షి వినయంగా నిలబడ్డాడు. అప్పుడు బ్రహ్మ ఏం చేశాడో, ఆ విషయాన్ని మనకు శ్రీరామాయణం తెలుపుతున్నది. "బ్రహ్మణా సమనుజ్ఞాతః సో ఽ ప్యుపావిశదాసనే"– బ్రహ్మ అంగీకారంతో వాల్మీకి తనకు తగిన ఆసనంలో కూర్చున్నాడు. ఈ విధంగా బ్రహ్మచే గౌరవింపబడిన గొప్పతనాన్ని కలిగినవాడు, వాల్మీకి మహర్షి.

వ్యాసమహర్షికి భాగవతాన్ని ఉపదేశించివాడు నారదమహర్షి. ఆ నారదమహర్షికి తండ్రి బ్రహ్మ. ఆ బ్రహ్మచే గౌరవింపబడిన గొప్పతనాన్ని కలిగినవాడు వాల్మీకి మహర్షి. బ్రహ్మ సమక్షంలోనే ఆ బ్రహ్మచే అంగీకరింపబడి, ఆదరింపబడి, తగిన ఆసనంలో వాల్మీకి కూర్చున్నాడు అంటే, వాల్మీకి మహర్షికి కల అతిశయం ఎంత గొప్పది! బ్రహ్మ ఈ విధంగా వాల్మీకి మహర్షిని ఎందుకు ప్రశంసించి, గౌరవించాడు? అంటే, వాల్మీకి కల రామప్రేమయే కారణం. రామప్రేమయే మూర్తీభవించినవాడు వాల్మీకి మహర్షి. అతనికి గల రామప్రేమయే శ్రీరామాయణంగా రూపొందింది.

ఆ విధంగానే కృష్ణప్రేమను కలిగినవారు, కృష్ణప్రేమయే మూర్తిభవించినవారు నమ్మాళ్వారులు. వారికి కల కృష్ణప్రేమ తిరువాయ్ మొழி ప్రబంధంగా అవతరించింది. అది శ్రీరామావతారం కోసం అవతరించింది, ఇది

శ్రీకృష్ణావతారం కోసం అవతరించింది. "ఏఱ్కుమ్ పెరుమ్ పుకழ் వానవరీశన్ కణ్ణన్ తనక్కు" అని అంటూ నమ్మాళ్వారులు తాము శ్రీకృష్ణుని కోసమే తిరువాయ్ మొழி ప్రబంధాన్ని పాడి, సమర్పించినట్లు తెలియజేశారు కదా. ఈ విధంగా శ్రీరామాయణం ఒక మహనీయులచే రచింపబడినదే. తిరువాయ్ మొழி ప్రబంధంకూడా ఒక మహనీయులచే రచింపబడినదే. అది కూడా భగవత్ప్రేమ తల ఎత్తగా రచించిన కావ్యమే. ఇది కూడా భగవత్ప్రేమ అతిశయించగా ఆవిర్భవించిన ప్రబంధమే. అది శ్రీరామచరిత్ర అయిన శ్రీరామాయణకావ్యం. ఇది శ్రీకృష్ణచరిత్ర అయిన తిరువాయ్ మొழி ప్రబంధం. ఈ విధంగా, ఈ రెండూ, ఇద్దరు మహనీయులచే రచింపబడినవి– అనే సామ్యాన్ని కలిగిన, రెండు ఉన్నతమైన ప్రమాణగ్రంథాలు.

ఇంతే కాదు. శ్రీరామాయణాన్ని భగవంతుడు ఆలకించాడు. ఆ విధంగానే, తిరువాయ్ మొழி ప్రబంధాన్ని కూడా భగవంతుడు ఆలకించాడు. భగవంతుడు ఆలకించిన శాస్త్రం శ్రీరామాయణం అయినట్టే, భగవంతుడు ఆలకించిన శాస్త్రం తిరువాయ్ మొழி. తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆలకించడంకోసంగా భగవంతుడు ఒక అధ్యయనోత్సవాన్నే ఏర్పాటు చేశాడుకదా. తిరుమంగై ఆళ్వార్ శ్రీరంగంలో శ్రీరంగనాథుని వేంచేపు చేసి, ఆల్వార్ తిరునగరి నుండి నమ్మాళ్వారులను వేంచేపు చేసి, మహావైభవంగా తిరువాయ్ మొழி త్తిరునాళ్ ను నిర్వహించారు. ఉన్నతమైనది అయిన తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆలకించడం కోసమే 10 నాళ్ల ఉత్సవంగా. మిగిలిన మూడు ఆయిరాల ప్రబంధాన్ని ఆలకించడం కోసం ఇంకొక 10 11 రోజుల ఉత్సవంగా అధ్యయనోత్సవం జరుగుతుంది. ఈ విధంగా తిరువాయ్ మొழி దివ్యప్రబంధాన్ని భగవంతుడు ఆలకించడం కోసమే ఒక

విలక్షణమైన ఉత్సవం ఇంతకాలం జరుగుతున్నదంటే ఎంతటి వైభవం ఈ తిరువాయ్ మొ*ళ్ళి* ప్రబంధానికి ఉన్నది!

ఈ విధంగానే, శ్రీరామాయణాన్ని కూడా భగవంతుడు ఆదరంగా విన్నాడు. ఈ విషయాన్ని శ్రీరామాయణంలోని బాలకాండలో నాలుగవ సర్గలోని చివరి శ్లోకం మనకు తెలుపుతున్నది. "స చాపి రామః పరిషద్గతః శనైః బుభూషయా సక్తమనా బభూవ హ" అనేది ఆ శ్లోకం. శ్రీరాముడుకూడా తన చరిత్రను చాలా ఆసక్తిగా విన్నాడు. ఎందుకోసం విన్నాడో తెలుసునా? "బభూషయా" "భవితుమిచ్చా బుభూషా". తాను సత్తను పొందడం కోసం శ్రీరామాయణాన్ని శ్రీరాముడు విన్నాడట. సత్తను పొందడం కోసం శ్రీరాముడు శ్రీరామాయణాన్ని వినడమే ఆశ్చర్యం. సత్తను పొందడం కోసం శత్రుఘ్నుడు శ్రీరామాయణాన్ని విన్నాడు, సత్తను పొందడం కోసం భరతుడు శ్రీరామాయణాన్ని విన్నాడు, సత్తను పొందడం కోసం సీత శ్రీరామాయణాన్ని విన్నది అంటే, ఆశ్చర్యం లేదు. భరతుడు కాని, శత్రుఘ్నుడు కాని, సీత కాని శ్రీరామాయణాన్ని విని, తమ మనసును ధరించారు అంటే, ఆశ్చర్యం లేదు. కాని, శ్రీరామాయణాన్ని శ్రీరాముడు విని, తాను మనసును ధరించాడు సత్తను పొందాడు –అంటేనేకదా, విశేషం. " మిదిలై చ్చెల్వి ఉలకుయిర్ వాయ్ త్త మక్కళ్ శెంబవళత్తిరళ్ వాయ్ తన్ శరిదై కేట్టాన్" అని శ్రీరాముడు కుశలవులు పాడగా తన చరిత్రను విన్నాడనే వృత్తాంతాన్ని కులశేఖరాళ్వార్ పెరుమాళ్ తిరుమొ*ళ్ళి* ప్రబంధంలో వర్ణించారు. అందువల్ల భగవంతుడు రామాయణాన్ని విన్నాడు, ఆ విధంగానే, తిరువాయ్ మొ*ళ్ళి* ప్రబంధాన్ని కూడా ఆలకించాడు. తిరువాయ్ మొ*ళ్ళి* అనేది అతడు విన్న ప్రమాణమే. శ్రీరామాయణం కూడా అతడు విన్న ప్రమాణమే అనేది ఈ రెండిటి మధ్య ఉండే మరొక సామ్యం. రామప్రేమ తల ఎత్తగా ఆవిర్భవించినది– శ్రీరామాయణం. శ్రీకృష్ణప్రేమ తల ఎత్తగా

ఆవిర్భవించినది– తిరువాయ్‌మొழி. ఇది మరొక సామ్యం. అందులో భగవత్ప్రభావం చెప్పబడింది ఇందులోనూ భగవత్ప్రభావం చెప్పబడింది –అనేది మరి ఒక సామ్యం.

ఇంకొక ముఖ్యమైన సామ్యాన్ని ఈ రెండిటి మధ్య మనం గమనించవచ్చు. తిరువాయ్ మొழி ప్రబంధంలో ప్రారంభంలో చెప్పబడిన విషయాన్నే శ్రీరామాయణం చివరిలో తెలియజేసింది. మొదట చెబితే ఏమి? చివర చెబితే ఏమి? చెప్పినది ఒకే విషయం కదా. ఆ విధంగా రెండిటిలోనూ సమానంగా చెప్పబడిన, ఒక ముఖ్యమైన విషయం ఏమో చూద్దాం.

శ్రీరామాయణంలో యుద్ధకాండంలో, యుద్ధం అంతా ముగిసిన తరువాత, బ్రహ్మ మొదలైన దేవతలు శ్రీరామచంద్రుని స్తుతించే సందర్భంలో, “జగత్ సర్వం శరీరం తే” అని శ్రీరాముని కీర్తించారు. ఈ ప్రకరణంలో ఉండే చాలా ముఖ్యమైన స్తోత్రం ఇది. “ఓ శ్రీరామా! నీకు జగత్తు అంతా శరీరమై ఉన్నది “అనేది దీని అర్థం.

ఇదే అర్థాన్ని నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటి దశకంలో ఏడవ పాశురంలో “ ఉడన్ మిశై ఉయిరెన కరందెంగుమ్ పరందుళన్” (శరీరంలో అంతటా ఆత్మ వ్యాపించి ఉండేటట్లు, ఈ జగత్తులో అంతటా పరమాత్మ వ్యాపించి ఉన్నాడు) అనే సూక్తిద్వారా తెలియజేశారు. “ యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరం, యస్య మృత్యుః శరీరమ్ ––– ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః” అనే ఈ ఉపనిషద్వాక్యంలోని అర్థమే శ్రీరామాయణంలో “జగత్ సర్వం శరీరం తే” అని చెప్పబడింది. ఇదే అర్థాన్ని నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్ మొழி ప్రబంధంలో “ఉడన్ మిశై ఉయిరెన కరందెంగుమ్ పరందుళన్” అని అనడంద్వారా తెలిపారు. విశిష్టాద్వైత శ్రీవైష్ణవ

సంప్రదాయానికి ప్రధానప్రతితంత్రార్థంగా చెప్పబడే శరీరాత్మభావమే ఇది. దీనిని శ్రీరామాయణం చివరలో తెలుపగా, తిరువాయ్ మొళ్రి ప్రబంధం ప్రారంభంలోనే పలికింది.

బ్రహ్మ ఒకటే సత్యం. దానికి కంటే వేరయినది ఇంకొకటి ఏమీ లేదు. ఆ బ్రహ్మం, అశేష విశేషప్రత్యనీక చిన్మాత్రమే. అది ఒక్కటే తత్వం. సజాతీయమైన జీవాత్మ లేదు, విజాతీయమైన జీవాత్మ లేదు, స్వగతమైన జీవాత్మ లేదు. బ్రహ్మ స్వగతమైన కళ్యాణ గుణాలను కలిగినది కాదు. సజాతీయ భేదశూన్య విజాతీయ భేదశూన్య స్వగత భేదశూన్య సర్వభేదశూన్య సర్వ విశేషశూన్య అశేష విశేషశూన్యమైన నిర్విశేషమే తత్వం. ఇది అద్వైత మతం. ఈ మతాన్ని నిరసిస్తూ నమ్మాళ్వార్లు, తిరువాయ్ మొళ్రి ప్రబంధంలోని మొదటి పాశురంలోని మొదటి పాదంలోనే "నలముడైయవన్"– గుణాలను కలిగినవాడు– అని అన్నారు. "తుయరఱు శుడరడి" (భక్తుల దుఃఖాలను తీర్చే ప్రకాశించే పాదాలను కలవాడు) అని అంటూ భగవంతుడు దివ్యమంగళవిగ్రహయుక్తుడు అని చూపించారుకదా. ఆ విధంగానే, "అయర్వఱు అమరర్ కళ్ అదిపతి"(నిత్యసూరులకు అధిపతి) అని నిత్యవిభూతి యుక్తుడు అన్నారు. ఈ విధంగా సకలకళ్యాణ గుణయుక్తుడై, దివ్యమంగళ విగ్రహయుక్తుడై, నిత్యవిభూతియుక్తుడై భగవంతుడు ఉంటాడని నమ్మాళ్వారులు తెలియజేశారు. ఈ విధంగా మన ప్రధానసంప్రదాయార్థాన్ని శ్రీరామాయణం చెబుతున్నది, ఆ విధంగానే తిరువాయ్ మొళ్రి ప్రబంధం చెబుతున్నది.

మన సంప్రదాయానికి ప్రతితంత్రార్థాలు అనేకం ఉన్నప్పటికీ, వాటిలో అతిముఖ్యమైనది శరీరాత్మ భావం. జగత్తుకు, బ్రహ్మకు మధ్య ఉండే శరీరాత్మభావం ఇది. ఈ శరీరాత్మభావాన్ని పురస్కరించుకునే భగవద్రామానుజులు సకలార్థాలను

అత్యంతసమంజసంగా నిరూపించారు. శ్రీభాష్యంలో రెండు చోట్ల "ఇతి సర్వం సమంజసమ్" అనే వాక్యం ఉన్నది. "ఈ విధంగా అంతా సమంజసం"– అని దీని అర్థం. ఏ విధంగా సమంజసం? శరీరాత్మభావరూప ప్రధానప్రతితంత్రార్థాన్ని నిరూపించే ఘటకశ్రుతిని మనం ప్రధానంగా గ్రహించినందున, భేదాన్ని చెప్పవచ్చు, అభేదాన్ని చెప్పవచ్చు. "ఒకటే తత్వం" అని చెప్పవచ్చు, "తత్వాలు మూడు" అని చెప్పవచ్చు. "విశిష్టైక్యాత్ ఐక్యశ్రుతిరపి చ సార్థా భగవతీ మిథో భేదం తత్వం చాభిలపతి భేదశ్రుతిరపి" అనే విధంగా అద్వైతశ్రుతి తత్వాల విశిష్టైక్యాన్ని తెలుపుతుంది, భేదశ్రుతి వీటి భేదమే తత్వమని తెలుపుతున్నది. దీనిని చెప్పడంకోసమే అంతర్యామి బ్రాహ్మణం ఉన్నది. " యస్య ఆత్మా శరీరమ్, యస్య పృథివీ శరీరమ్, యస్య మృత్యుః శరీరం" అని అన్నిటినీ శరీరంగా కలిగి, అన్నిటికీ ఆత్మగా భగవానుడు ఉన్నాడుకదా. ఆ శరీరాత్మభావాన్ని పురస్కరించుకునే తత్వనిష్కర్షను, హితనిష్కర్షను పురుషార్థాల నిష్కర్షను భగవద్రామానుజులు చేశారు.

మనకు బయటకు కనిపించేది శరీరం, దాని లోపల ఉండేది ఆత్మ. అయితే, మనకు బయటకు ఈ రెండు ఒకటిగా కనిపిస్తున్నాయి. ఈ రెండు తత్వాలలో, శరీరం కంటే ఆత్మ ఉన్నతమైనది. "నేను" అనే ఆత్మ వస్తువు ఉన్నతమైనది. మన వస్తువు అయిన శరీరం మనకంటే తక్కువది. ఈ విధంగానే, ఈ ఆత్మను తనకు శరీరంగా కలిగినవాడు కనుక, భగవంతుడు జీవతత్వం కంటే ఉన్నతుడు. అతని కంటే జీవతత్వం తక్కువది. ఇది తత్వానికి సంబంధించిన నిర్ణయం. ఇది జీవాత్మ, పరమాత్మల మధ్య ఉండే శరీరాత్మభావాన్ని పురస్కరించుకుని చేయబడింది.

ఇక, హితానికి సంబంధించిన నిర్ణయం ఏమంటే, ఈ శరీరాన్ని సర్వకాల సర్వావస్థలలోనూ కాపాడుకునేవాడు ఎవడంటే, ఆ శరీరంలో ఉండే ఆత్మయే కదా. ఈ శరీరం, తన రక్షణకోసం ఆత్మను ఎదురుచూస్తుందే తప్ప తనని తాను రక్షించుకునే స్వభావాన్ని కానీ, శక్తిని కానీ కలిగినది కాదు. ఈ శరీరం తనను తానే రక్షించుకోదు, రక్షించుకోలేదు. ఆత్మనే తనకు రక్షకునిగా కలిగి ఉన్నది. ఆత్మ "ఇది నా శరీరం". అని అభిమానిస్తున్నది, కనుక, శరీర రక్షణాన్ని చేయవలసిన బాధ్యత ఆత్మదే.

పరమాత్మకు రెండు విధాలైన శరీరాలు ఉన్నాయి అందులో ఒకటి బాహ్యశరీరం, రెండవది అంతఃశరీరం. బాహ్యశరీరం ప్రకృతి, అంతః శరీరం ఆత్మ. ఈ రెండిటిని గూర్చి గీతాచార్యుడు భగవద్గీతలో ప్రస్తావించాడు. "భూమి రాపో ఽ నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ, అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా, అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మఏ పరామ్" అని గీతాచార్యుడు అన్నాడు. ఒకటి అపరా ప్రకృతి, రెండవది పరా ప్రకృతి. అపరా ప్రకృతి– ప్రకృతి, పరా ప్రకృతి –జీవాత్మ. అర్జునా! ఈ రెండు తత్వాలు నాకు శరీరాలే. ప్రకృతి తత్వం బాహ్యశరీరం, జీవతత్వం అంతః శరీరం. ఈ విధంగా అంతః శరీరమైన ఆత్మకు గల దోషాలు " పొయ్ న్నిన్ఱ ఞానముమ్ పొల్లా వழுక్కుమ్ అழுక్కుడంబు" (అయథార్థ జ్ఞానం, అసత్ ప్రవర్తన, నీచమైన, మలినంతో నిండిన శరీరం) అనే మూడు. ఈ మూడు విధాలయిన దోషాలను ఎవడు తొలగిస్తున్నాడు? అంటే, శరీరి అయిన భగవంతుడే. "నాది" అని అభిమానించడం అభిమానికృత్యం. ఆ అభిమాని భగవంతుడే కదా. అందుచేత ఎవరు ఉపాయం? అంటే ఈ శరీరాన్ని "నాది" అని అభిమానించే ఆత్మ ఈ శరీరానికి రక్షకుడు అయినట్లే, ఈ ఆత్మను "నాది" అని అభిమానించే భగవంతుడే రక్షకుడు– అనే ఈ విషయాన్ని స్పష్టంగా మన

పూర్వాచార్యులు జీవాత్మ, పరమాత్మల మధ్య ఉండే శరీరాత్మభావాన్ని పురస్కరించుకొని నిర్ణయించారు.

ఇక, పురుషార్థ విషయాన్ని గమనిస్తే, ఈ శరీరం తనను సత్తుగా కలిగిన ఆత్మకు సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోనూ ఈ ఆత్మకు అభిమతమైన కైంకర్యాన్ని చేస్తుంది. ఈ ఆత్మకు ఈ శరీరం సేవ చేసినట్లుగా మరెవ్వరూ చేయరు, చేయలేరు కూడా. పుత్రుడు చేయగలడా? భార్య చేయగలదా? సేవకులు చేయగలరా? నిశ్చయంగా చేయలేరు. ఈ శరీరం తన ఆత్మకు కైంకర్యం చేయడం కోసమే ఏర్పడి ఉన్నది. అదే శరీరానికి కల పరమప్రయోజనం. ఆ విధంగానే, "ఈ ఆత్మ భగవంతునకు శరీరం" అని శాస్త్రాలు ఘోషిస్తున్నందున, ఆ భగవంతునకు అన్ని విధాలయిన సేవలను చేయడం కంటే మించిన పురుషార్థం వేరొకటి లేదు. భగవంతునకు తప్ప వేరొకరికి సేవ చేయడం అనేది ఈ జీవాత్మకు యుక్తం అయినది కాదు. ఈ విధంగా పురుషార్థనిర్ణయంకూడా జీవాత్మ పరమాత్మల మధ్య ఉండే శరీరాత్మభావాన్ని ఆధారంగా చేసికొనే నిర్ణయింపబడింది. ఇందువల్ల, తత్త్వహితపురుషార్థాల యథార్థ స్వరూపనిర్ణయం శరీరాత్మ భావాన్ని పురస్కరించుకునే ఉన్నది.

గీతాచార్యుడు గీతాశాస్త్రంలో ఎన్నో మహార్థాలను ఉపదేశించాడు. " "విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు" (అర్జునా! నేను ఇంతవరకు చెప్పినదానిని అంతటినీ బాగా విచారించి చూచి, నీకు ఏది నచ్చితే దానిని చేయి)" నేను నీకు చెప్పవలసిన విషయాలను అన్నిటినీ చెప్పాను ఒక్కసారి గమనించి చూడు. నీకు ఇష్టమైన దానిని ఆచరించు" అని అన్నాడు, శ్రీకృష్ణుడు.

గీతలోని రెండవ అధ్యాయంలో 12వ శ్లోకంనుండి ఆరంభించి, ఈ 18 వ అధ్యాయం 63వ శ్లోకం వరకు ఉండే భాగం అంతా శ్రీకృష్ణుడు అర్జునునకు చేసిన

ఉపదేశం. ఈ ఉపదేశాన్ని అంతటిని గమనించి చూడమన్నాడు, శ్రీకృష్ణుడు. వెంటనే శ్రీకృష్ణుని ఉపదేశాన్ని గమనించి చూచిన అర్జునుడు ఏడవడం ఆరంబించాడు. "శ్రీకృష్ణా! నాకు ఏమి చేయాలో తోచడం లేదే!"అని అన్నాడు. అప్పుడు శ్రీ కృష్ణుడు" అర్జునా! ఇదేమి? ఈ విధంగా అంటున్నావు! నేను గీతను ఉపదేశించడానికి ముందు శోకించావు. గీతోపదేశాన్ని విన్న తరువాత కూడా శోకిస్తున్నావే! ఇదేమి? గీతోపదేశానికి ముందున్నది నీకు విమోహమే, ఉపదేశాన్ని చేసిన తరువాత కలిగినదికూడా నీకు విమోహమేనా? . ఆశ్చర్యంగా ఉన్నదే!" అని అన్నాడు, శ్రీకృష్ణుడు.

అప్పుడు, అర్జునుడు "అప్పుడు అజ్ఞానంవల్ల మోహం, ఇప్పుడు జ్ఞానంవల్ల మోహం" అన్నాడు. "నేను ఆత్మ అనే విషయాన్ని నీవు చెప్పగా పలు సందర్భాలలో తెలుసుకున్నాను. నీవు పరమాత్మవు అనే విషయాన్ని కూడా గ్రహించాను. "అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః", " ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽ ర్జున!తిష్ఠతి" ఆని నీవు "నేను నీకు ఆత్మను, నీవు నాకు శరీరభూతుడవు" అనే విషయాన్ని పలుచోట్ల చెప్పగా తెలుసుకున్నాను.

"తస్మాత్ యధ్యస్వ భారత" అని అన్నావు. "కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కరాచన" యుద్ధాన్ని చేయమని పలుచోట్ల చెప్పావు. "నేనే నీకు ఆత్మను, నీవు నాకు శరీరానివి" అని కూడా పలుచోట్ల అన్నావు. నీవు నన్ను యుద్ధం చేయమని అన్నప్పుడు, యుద్ధం చేయాలని తోస్తున్నది "నేను నీకు శరీరాన్ని"– అని నీవు చెప్పినప్పుడు, "నేను నీకు శరీరాన్ని కనుక, యుద్ధం చేయవలసిన అక్కరలేదని, నీవు ఆత్మవు కనుక, నీవే రక్షణాన్ని తోస్తున్నది. ఈ విధంగా ఒకసారి యుద్ధం చేయాలని, ఇంకొక మారు యుద్ధం చేయనక్కరలేదని తోస్తున్నందున, ఏమి చేయాలో తెలియక మోహాన్ని పొందాను. నీవు యుద్ధం చేయమన్నప్పుడు చేయాలని, నీవు నాకు

ఆత్మవని అన్నప్పుడు చేయనక్కరలేదని, ఈ విధంగా నాలో ద్వైధీభావం కలిగి, మోహం కలుగుతున్నది కృష్ణా!” అన్నాడు, అర్జునుడు. అప్పుడు శ్రీకృష్ణుడు “అర్జునా! శోకించకు” అన్నాడు.

ఇంతకు ముందు అర్జునునకు ఉపదేశింపబడినవి. కర్మజ్ఞాన భక్త్యాది ఉపాయంతరాలు. వీటి విషయంలో అర్జునునకు రెండు విధాలయిన సందేహాలు కలిగాయి. ఒకటి– దుష్కరత్వశంక. రెండవది –అప్రాప్తత్వ శంక. అంటే, ఈ ఉపాయాలను ఆచరించడం కష్టం కదా! అనే ఒక సందేహం, ఒకవేళ ఆచరించడం సాధ్యం అయినప్పటికీ, అవి ఆత్మస్వరూపానికి తగినవి కాదు కదా! అనే ఇంకొక సందేహం. ఈ రెండు సందేహాలు అర్జునునకు కలిగాయి–అని అంటారు, మన పూర్వాచార్యులు.

వాస్తవం గమనించినప్పుడు, ఈ చేతనునకు కర్మయోగం చేయడం సాధ్యమా! జ్ఞానయోగం చేయడం సాధ్యమా! భక్తి యోగం చేయడం సాధ్యమా! ఏదీ సాధ్యం కాదు కదా! ఒక గంట సేపు కూడా నిశ్చలంగా కూర్చోవడం మనకు సాధ్యం కాదే! మరి, భగవంతుని నిరంతరంగా ధ్యానించడం అనే భక్తియోగం చేయడం ఏ విధంగా మనకు సాధ్యం అవుతుంది? అందుచేత ఈ కర్మజ్ఞాన భక్తియోగాలు అన్నీ దుష్కరాలు. అవి చేయడానికి సులభమైనవి కాదు. మనం ఆచరించి పూర్తి చేయలేని ఉపాయాంతరాలు.

ఇవి దుష్కరాలు ఆవడమే కాదు, ఒకవేళ వీటిని ఆచరించడం సాధ్యమైనప్పటికీ, వీటి స్వరూపాన్ని గమనిస్తే, ఇవి ఎంత మాత్రం జీవస్వరూపానికి తగినవి కాదు. ఎందుకంటే, భగవంతుడు మనకు ఆత్మ– అని, ఆ భగవంతునకు మనం శరీర భూతులం– అని ఈ గీతాశాస్త్రంలో పలుచోట్ల చెప్పబడింది కనుక. అందువల్ల అతడు మనకు ఆత్మ, మనం ఆ భగవంతునకు శరీరం. శరీరం అనేది

తనను తాను రక్షించుకునే యోగ్యత కలిగినది కాదు. శక్తిని కలిగినదికూడా కాదు. ఆత్మ అనే ఈ శరీరాన్ని రక్షించే ప్రాప్తి దీనిని "నాది" అనే అభిమానించే భగవంతునికే ఉన్నది. అతడు ఆత్మయై ఉన్నాడు, అందువల్ల, "భగవంతుడు శరీరి కనుక, ప్రాప్తిని కలవాడు. నేను శరీరమై ఉన్నవాడను. అందుచేత నన్ను రక్షించుకోవడంలో ప్రాప్తిని లేనివాడను. అందువల్ల, నా రక్షణలో శక్తి, ప్రాప్తి లేని నేను రక్షించుకోగలనా? ప్రాప్తి లేని నేను భక్తి మొదలైన ఉపాయంతరాలను ఏ విధంగా ఆచరించగలను? అవి నాకు అప్రాప్తాలు కదా! వాటిని ఆచరించడం సాధ్యమా!" అని భావించిన అర్జునునకు గీతోపదేశం తరువాత కూడా మహాశోకం కలిగినది.

అప్పుడు శ్రీకృష్ణుడు "అర్జునా! నీకు ఇంతటి మనఃపరిపక్వత కలగడం కోసమేసుమా, నేను ఇంతటి విస్తృతమైన గీతాశాస్త్రాన్ని ఉపదేశం చేశాను. నీవు నాకు శరీరానివే. నేను నీకు ఆత్మనే. తెలుసుకోవలసిన విషయాన్ని నీవు తెలుసుకున్నావు. అందుచేత, నువ్వు శోకాన్ని విడచిపెట్టు. నీ రక్షణ బాధ్యత నాదే. నీ రక్షణ బాధ్యతను నీవు నా వద్ద సమర్పించు. నేను నీకు ఆత్మను కనుక, నీవు నాకు శరీరానివి కనుక, నిన్ను నేను రక్షిస్తాను, శోకించకు" అని అన్నాడు. ఈ అర్థాలన్నీ ఆత్మ పరమాత్మల మధ్య ఉండే శరీరాత్మ భావం భాసిస్తే కానీ తెలియవు.

ఈ విషయాన్నే శ్రీరామాయణం చివరిలో " జగత్ సర్వం శరీరం తే "అనే సూక్తి ద్వారా తెలియజేసింది. దీనినే నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్ మొழி ప్రబంధం ఆరంభంలో" ఉడన్ మిశై అయి ఉయిరెనా కరందెంగుమ్ పరందుళన్" అని అన్నారు. ఈ విధంగా విశిష్టాద్వైత శ్రీవైష్ణవసంప్రదాయ ప్రధానప్రతితంత్రార్థమైనది, జీవనాడి అయినది శరీరాత్మభావమే. దీనినే ఈ రెండు ప్రధాన ప్రమాణాలు మనకు తెలుపుతున్నాయి. దీనిని అంతటినీ గమనించినప్పుడు,

వాల్మీకిరామాయణంవంటిదే తిరువాయ్ మొழிకూడా– అని తెలుస్తుంది. ఇవి ఈ రెండు ప్రధానప్రమాణాల మధ్య ఉండే కొన్ని సామ్యాలు.

వశిష్టమహర్షి మహాజ్ఞాని. నిజమే. కానీ, “నాకంటే వశిష్టుడు గొప్ప జ్ఞాని” అని నేను చెప్పాను అనుకోండి. ఈ మాట ఎంత హాస్యాస్పదంగా ఉంటుంది! ఏ మాటను ఎవరు చెప్పాలన్నా, ఆ మాటను వారు చెప్పడానికి తగిన యోగ్యత అతనికి ఉండాలి కదా. ప్రాప్తి ఉండాలి కదా. చెప్పే మాట నిజమే అయినా, ఆ మాటను చెప్పడానికి ఒక యోగ్యత ఉండాలి. నా కంటే ఉన్నతమైన, గొప్ప పాండిత్యాన్ని కల మహనీయులు ఒకరు, “నాకంటే వశిష్ఠుడు గొప్ప జ్ఞాని” అని అంటే అర్థం ఉంటుంది, కానీ, చాలా అల్పమైన పాండిత్యాన్ని కలిగిన నేను ఆ మాటను చెప్పడంలో అర్థం లేదు. చెప్పడానికి నాకు యోగ్యతకూడా లేదు.

ఆ విధంగానే, వాల్మీకి రామాయణం, తిరువాయ్ మొழி– అనే ఈ రెండు గ్రంథాలు ఉన్నతమైన ప్రమాణాలే, ఉన్నతమైన గ్రంథాలే. ఇందులో సందేహం లేదు. ఈ రెండు గ్రంథాలకు మన పూర్వాచార్యులు అద్భుతంగా వ్యాఖ్యానాలను అనుగ్రహించి, ఎన్నో మహార్థాలను నిరూపించారు. ఇవి పరస్పరం అర్థసాదృశ్యాన్ని కలిగి ఉన్నాయని నిరూపించారు. వాల్మీకి రామాయణం నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி, భగవద్రామానుజులు అనుగ్రహించిన శరణాగతిగద్య, శ్రీపిళ్లైలోకాచార్యులవారు అనుగ్రహించిన శ్రీవచనభూషణం– అనే ఈ నాలుగు గ్రంథాలు ఒకే విషయాన్ని నిరూపిస్తున్నాయి. అయితే, విషయక్రమంలో మార్పు ఉన్నది. శ్రీరామాయణం, తిరువాయ్ మొழி– అనే ఈ రెండు గ్రంథాలు ఒకే క్రమంలో విషయనిరూపణను చేస్తున్నాయి. ఆ విధంగానే, భగవద్రామానుజులు శరణాగతి గద్యలో ఏ క్రమంలో విషయ నిరూపణలు చేశారో, అదే క్రమంలో శ్రీపిళ్లైలోకాచార్యులవారుకూడా శ్రీవచనభూషణగ్రంథంలో విషయాన్ని

నిరూపించారు. అందువల్ల, విషయనిరూపణ క్రమంలో వాల్మీకి రామాయణం, తిరువాయ్ మొ*ళి* సమానం. శరణాగతిగద్య, శ్రీవచన భూషణం సమానం– అని అంటారు, మన పూర్వాచార్యులు.

ఈ నాలుగు గ్రంథాలు ద్వయమంత్రానికి వ్యాఖ్యానరూపాలు–అనేది సత్సంప్రదాయం. "సాధీయాన్ సంప్రదాయః" అని గద్యత్రయ వ్యాఖ్యానంలో దేశికులు అంటారు. ద్వయార్థాన్ని విశదంగా భగవద్రామానుజులు శరణాగతి గద్యలో తెలియజేశారు. ఈ ద్వయార్థాన్నే శ్రీపిళ్లైలోకాచార్యులవారు శ్రీవచన భూషణంలోని నాలుగు ప్రకరణాల్లో తెలిపారు. అయితే, శ్రీరామాయణం, తిరువాయ్ మొ*ళి* అనే ప్రబంధాలలోని ద్వయార్థప్రతిపాదన క్రమం వేరు, శరణాగతిగద్య, శ్రీవచనభూషణం అనే గ్రంథాలలోని ద్వయార్థ ప్రతిపాదనక్రమం వేరు.

ఏ విషయాన్ని అయినా వ్యాఖ్యానం చేసేటప్పుడు, మూలం ఏ క్రమంలో ఉందో, అదే క్రమంలో వ్యాఖ్యానం చేయడం అనేది క్రమం. ద్వయంలో "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అనేది పూర్వవాక్యం. "శ్రీమతే నారాయణాయ నమః" అనేది ఉత్తరవాక్యం. ఈ విధంగా వాక్యద్వయాత్మకమైన ద్వయమంత్రాన్ని వ్యాఖ్యానం చేసేటప్పుడు, సామాన్యంగా ఏ విధంగా వ్యాఖ్యానం చేస్తారు? "శ్రీమన్, నారాయణ, చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే, నారాయణాయ, నమః" అనే క్రమంలోకదా వ్యాఖ్యానం చేస్తారు. అయితే, నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ళి* ప్రబంధంలో, వాల్మీకి భగవానుడు శ్రీరామాయణంలో ఆ విధంగా చేయలేదు. వారు ఏ క్రమంలో వ్యాఖ్యానం చేశారంటే, ద్వయంలోని ఉత్తర వాక్యార్థాన్ని ముందు చెప్పి, తరువాత పూర్వవాక్యార్థాన్ని వివరించారు. అంటే, ద్వయంలోని రెండు వాక్యాలను వ్యుత్క్రమంలో వివరించారు. భగవద్రామానుజులు శ్రీపిళ్లైలోకాచార్యులవారు అయితే, ఆ విధంగా కాకుండా, సక్రమంగానే వ్యాఖ్యానం

చేశారు. అంటే, ద్వయంలోని పూర్వవాక్యార్థాన్ని ముందు నిరూపించి, ఉత్తరవాక్యార్థాన్ని తరువాత నిరూపించారు. ఇది సక్రమవ్యాఖ్యానం. శ్రీరామాయణం, తిరువాయ్ మొ*ఴి* ప్రబంధాలలోని ద్వయమంత్రవ్యాఖ్యానం వ్యుత్క్రమవ్యాఖ్యానం.

శ్రీరామాయణంలో ముందుగా ద్వయంలోని ఉత్తర వాక్యార్థం ప్రతిపాదింపబడింది బాలకాండనుండి, ఆరణ్యకాండలో సీతావియోగంవరకు ఉండే భాగంలో ద్వయంలోని ఉత్తరవాక్యార్థం ప్రతిపాదింపబడింది. ఉత్తరవాక్యంలోని శ్రీమత్ శబ్దార్థాన్ని బాలకాండలో, నారాయణశబ్దార్థాన్ని అయోధ్యాకాండలో, ఆయ, నమశ్శబ్ధార్థాలను ఆరణ్యకాండలో సీతావిశ్లేషంవరకు ఉండే భాగంలో వాల్మీకి భగవానులు నిరూపించారు. ఆ తరువాత, అరణ్యకాండలోని మిగిలిన భాగంలో ద్వయపూర్వవాక్యంలో ఉండే శ్రీమత్ శబ్దంలోని అర్థం, కిష్కింధాకాండలో నారాయణపదార్థం, సుందరకాండలో చరణౌశబ్దార్థం, యుద్ధకాండలో "శరణం ప్రపద్యే" అనే పదాల అర్థం ప్రతిపాదింపబడ్డాయి–అని అంటారు, మన పూర్వాచార్యులు. ఈ విధంగా శ్రీరామాయణంలో ఉత్తరవాక్యార్థం ముందు, పూర్వవాక్యార్థం తరువాత నిరూపింపబడ్డాయి.

ఈ విధంగానే నమ్మాళ్వార్లుకూడా తిరువాయ్ మొ*ఴి* ప్రబంధంలోని మొదటి, రెండవ, మూడవ శతకాలతో ద్వయంలోని ఉత్తరవాక్యార్థాన్ని నిరూపించారు. నాల్గవ, ఐదవ, ఆఱవ శతకాలలో ద్వయంలోని పూర్వ వాక్యార్థాన్ని ప్రతిపాదన చేశారు. జగత్తుకు అంతటికి తిలకంవంటివాడైన శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో లక్ష్మీరూపిణి అయిన పద్మావతిదేవి పురుషకారాన్ని పురస్కరించుకొని, " అలర్ మేల్మంగై ఉఱై మార్బా! పుకల్ ఒన్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీ*ఴ్* అమర్ న్దు పుకుందేనే" అని శరణాగతి చేశారు, నమ్మాళ్వారులు. ఈ విధంగా పూర్వవాక్యార్థాన్ని

ఆరవ శతకంలో చివర, ఉత్తర వాక్యార్థాన్ని మూడవ శతకంలో చివర ఆళ్వారులు అనుసంధించారు. ఈ విధంగా ద్వయార్థప్రతిపాదనక్రమం శ్రీరామాయణం, తిరువాయ్ మొళ్ళి అనే రెండు ప్రబంధాలలో ఒకే విధంగా ఉన్నది.

ద్వయార్థప్రతిపాదనలో సక్రమం, వ్యుత్క్రమం– అనే రీతిగా రెండు విధాలైన క్రమాలు ఎందుకు ఏర్పడ్డాయి? అనే విషయాన్ని కూడా ఇపుడు గమనిద్దాం. ఆచార్యసన్నిధిలో శిష్యుడు ఉపదేశాన్ని పొందడంకోసం వెళ్లినపుడు ఉపదేశాన్ని పొందే క్రమం వ్యుత్పత్తిక్రమం. విషయాన్ని తెలుసుకోవడంకోసం శిష్యుడు వెళ్లే సమయం కనుక అది వ్యుత్పత్తివేళ. అప్పటి క్రమం వ్యుత్పత్తిక్రమం. ఈ ఉపదేశవేళలో, అంటే, వ్యుత్పత్తివేళలో ఆచార్యుడు దేనిని ముందు చెప్పాలంటే, ముందు శిష్యుడు పొందవలసిన పురుషార్థాన్నిగూర్చి, దాని గౌరవాన్నిగూర్చి గొప్పగా చెప్పాలి. అపుడు, అటువంటి, ఉన్నతమైన పురుషార్థాన్ని ఏ విధంగా పొందాలి? అనే జిజ్ఞాస శిష్యునకు కలుగుతుంది. ఆ విషయాన్ని శిష్యుడు ఆచార్యుని అడుగుతాడు. అప్పుడు ఆ పురుషార్థాన్ని పొందడానికి ఆవశ్యకమైన ఉపాయాన్నిగూర్చి శిష్యునకు ఆచార్యులు తెలియజేయాలి. అందుచేత, వ్యుత్పత్తివేళలో ప్రాప్యజ్ఞానాన్ని ముందు, ప్రాపకజ్ఞానాన్ని తరువాత చెప్పాలి.

అనుష్ఠానకాలంలో ఈ క్రమం వేరుగా ఉంటుంది. అప్పుడు ఉపాయాన్ని అనుష్ఠిస్తే తప్ప ఉపాయం లభించదు. ముందు ఉపేయాన్నిపొంది, తరువాత ఉపాయాన్ని అనుష్ఠించడం– అనే క్రమం అనుష్ఠాన కాలంలో ఉండనే ఉండదు. ముందు పురుషార్థం లభించిందని అనుకోండి, ఇంక ఆ ఉపేయాన్ని పొందడానికి కావలసిన ఉపాయం పై ఆసక్తి ఎందుకు ఉంటుంది? ఎవరికి ఉంటుంది? అందుచేత, ముందుగా ఉపాయాన్ని అనుష్ఠించిన తరువాతనే ఉపేయాన్ని పొందవలసి ఉంటుంది. ఇది అనుష్ఠానవేళలోని క్రమం. కనుక, ఉత్పత్తివేళలో

పురుషార్థం ముందు, దాని ఉపాయం తరువాత, అనుష్ఠానకాలంలో ఉపాయం ముందు, ఉపేయం తరువాత –అనేది క్రమం.

గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో అయితే, ఈ రెండు క్రమాలు ఉన్నాయి. ముందుగా, ఉపదేశప్రక్రియ మొదటి పాశురంలో గోచరిస్తుంది. అనుష్ఠానక్రమం 28వ, 29వ పాశురాలలో కనిపిస్తుంది. తిరుప్పావై ఆరంభంలో తాను చేసే వ్రతాన్నిగూర్చిన క్రమాన్ని ఉపదేశిస్తూ, "నమక్కే పఱై తరువన్" అని గోదాదేవి అన్నది. ఇక్కడ "నమక్కే" అనే పదం అధికారిస్వరూపాన్ని తెలుపుతుంది. "పఱై" అనే పదం పురుషార్థస్వరూపాన్ని తెలుపుతుంది. " తరువాన్" అనేది ఉపాయస్వరూపాన్ని తెలుపుతుంది. అందుచేత, ఇక్కడ గోదాదేవి ముందుగా " పఱై" అని పురుషార్థస్వరూపాన్ని నిర్దేశించి, ఆ తరువాత " తరువాన్" అని ఉపాయస్వరూపాన్ని నిర్దేశించింది. ఎందుకంటే, ఇది ఉపదేశవేళ కనుక. పురుషార్థాన్ని అనుగ్రహించేవాడు ఎవడు? అనే దానికి సమాధానంగా "తరువాన్" అని అన్నది.

అనుష్ఠానవేళలో క్రమం వేరు. ఈ క్రమం 28వ, 29వ పాశురాలలో తెలుపబడింది. 28వ పాశురంలో ఉపాయస్వరూపాన్ని, 29వ పాశురంలో ఉపేయస్వరూపాన్ని గోదాదేవి తెలియజేసింది. మొదటి పాశురంలో " తరువాన్" అని నిర్దేశించిన ఉపాయస్వరూపాన్ని 28వ పాశురంలో ఆమె వివరించింది. "పఱై" అని నిర్దేశించిన ఉపేయ స్వరూపాన్ని 29వ పాశురంలో వివరించింది. అనుష్ఠానవేళ కనుక ఇక్కడ ముందుగా ఉపాయం, ఆ తరువాత ఉపేయం చెప్పబడ్డాయి. అందువల్లనే మన పూర్వాచార్యులు ఈ ప్రబంధాన్ని వ్యాఖ్యానిస్తూ, ముందుగా మొదటి పాశురంలో ప్రాప్యప్రాపకసంగ్రహాన్ని తెలియజేసిన గోదాదేవి, చివరిలో,

అనుష్ఠాన వేళలో ముందుగా ప్రాపకాన్ని, ఆ తరువాత ప్రాప్యాన్ని తెలుపుతున్నదని అన్నారు.

అందుచేత, వ్యుత్పత్తికాలానుగుణమైనవిగా శ్రీరామాయణం, తిరువాయ్ మొళి ప్రబంధం. అనుష్ఠానకాలానుగుణమైనవిగా భగవద్రామానుజుల శరణాగతి గద్య, శ్రీపిళ్లైలోకాచార్యులవారి శ్రీవచనభూషణం అనే గ్రంథాలు ఏర్పడ్డాయి. ఈ విధంగానే, శ్రీరామాయణానికి, తిరువాయ్ మొళి ప్రబంధానికి మధ్య ఉండే వేరొక సామ్యం ఏమంటే, ఈ రెండు ద్వయాన్ని వివరించే గ్రంథాలై ఉండడం. అంతేకాదు, ద్వయమంత్రంలో ఉండే ఉత్తరవాక్యార్థాన్ని ముందు తెలియజేసి, ఆ తరువాత పూర్వవాక్యార్థాన్ని తెలియజేయడం– అనే క్రమంలో కూడా ఈ రెండిటికి సామ్యం ఉన్నది– అని తెలియజేశారు, మన పూర్వాచార్యులు.

శ్రీరామాయణానికి కర్త– వాల్మీకి భగవానుడు. తిరువాయ్ మొళి ప్రబంధాన్ని అనుగ్రహించినవారు– నమ్మాళ్వారులు. ర శ్రీరామాయణం కంటే తిరువాయ్ మొళి ప్రబంధానికి ఉండే గొప్పతనం ఏమి? అని అంటే,

శ్రీరామాయణాన్ని వాల్మీకిమహర్షి రచించారు. ఏ విధంగా రచించారు? తిరువాయ్ మొళి ప్రబంధాన్ని నమ్మాళ్వారులు అనుగ్రహించారు, ఏ విధంగా అనుగ్రహించారు? దానికీ దేవతానుగ్రహం ఉన్నది, దీనికీ దేవతానుగ్రహం ఉన్నది. శ్రీరామాయణరచనకు కారణభూతమైన దేవత ఎవరు? తిరువాయ్ మొళి ప్రబంధం రచనకు కారణభూతమైన దైవం ఎవరు? అనే విషయాన్ని మనం గమనించాలి. ఈ దైవాలు ఇద్దరి మధ్య ఉండే భేదాన్ని ఆచార్యహృదయగ్రంథంలో నాయనార్ చక్కగా తెలియజేశారు. "ధర్మవీర్యజ్ఞానత్తాలే తెళిందు, హృష్టరాయ్ మేలే మేలే తొడుప్పారై ప్పోలన్ద్, అరువిన భక్తియాలే ఉళ్ కలంగి శోకిత్తు, ముప్పారు

మాసమ్ మోహిత్తు, వరుంది ఏంగి త్తాழ్న్ద శొల్క్కళాలే నూట్కిలు ఇవర్ “అనే సూత్రంలో.

వాల్మీకిభగవానుని అనుగ్రహించినవాడు, దేవతాంతరమైన బ్రహ్మ. నమ్మాళ్వారులకు “మయర్వఱ మదినలమ్” అనుగ్రహించినవాడు సర్వజ్ఞుడైన సర్వేశ్వరుడు. “తిరుమాలాల్ అరుళప్పట్ట శడకోపన్” అని వారే అన్నారు. బ్రహ్మ అనుగ్రహంతో వాల్మీకి జ్ఞానాన్ని పొంది, సంతోషించి, క్రమక్రమంగా అవిచ్ఛిన్నంగా శ్లోకాలను రచించాడు. రచనను ఆపినది లేదు, ఆలోచించినది లేదు, ఏ విధమైన ఆటంకం లేకుండా, శోకం లేకుండా 24 వేల శ్లోకాలను మహర్షి రచించాడు. ఇది వాల్మీకి శ్రీరామాయణాన్ని రచించిన క్రమం.

మరి, నమ్మాళ్వార్లు ఏ విధంగా తిరువాయ్ మొழిని అనుగ్రహించారు? భగవంతుని నిర్హేతుకకృపవల్ల భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని పొందారు. “ మయర్వఱ మదినలమ్ అరుళినన్” అని ఆళ్వార్లే స్వయంగా అన్నారు. ఇటువంటి భక్తితో మనస్సులో కలతను పొందారు. వాల్మీకి బ్రహ్మ అనుగ్రహించిన జ్ఞానంతో తెలివి పొందారు. అళ్వార్లు భగవంతుడు అనుగ్రహించిన భక్తితో కలతను, ఆర్తిని, శోకాన్ని పొందారు. వాల్మీకి తెలివిని పొంది సంతోషించాడు, వీరు మోహాన్ని పొంది, శోకించారు. వాల్మీకి ఏమాత్రం ఆగకుండా శ్రీరామాయణ రచనను చేశాడు. ఆళ్వార్లు ప్రబంధ ప్రారంభంలోనే ఆరు నెలల కాలం మోహాన్ని పొందారు. వాల్మీకికి జ్ఞానం, అళ్వారులకు భక్తి. వాల్మీకికి మనసులోని ప్రసన్నత, వీరికి మనసులో కలత, వాల్మీకి మనసులో సంతోషం, వీరికి మనసులో దుఃఖం, వాల్మీకి ఆగకుండా రచనను సాగించడం, వీరు గాఢమైన భక్తిపారవశ్యంచేత 6 నెలల కాలం మోహాన్ని పొందడం. ఇవి వీరిద్దరి మధ్య ఉండే తేడాలు.

ఆళ్వార్లు తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటి దశకంలో భగవంతుడు సర్వేశ్వరుడు– అనే విషయాన్ని నిరూపించారు. ఈ విధంగా భగవంతుడైన నారాయణుడు పరత్వాన్ని కలిగినవాడు కనుక, "ఎణ్ పెరుక్కన్నలత్తు ఒణ్ పొరుళ్ ఈఱిల వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్ శేరే", " వీడుమిన్, ముఱ్ఱవుమ్ వీడు శెయ్ దు ఉమ్ముయిర్ వీడుడైయానిడై వీడు శెయ్ మ్మినే" అని అంటూ "పరాత్పరుడైన ఆ శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను అశ్రయించండి"– అని రెండవ దశకంలో అన్నారు. "సరే, మీరు భగవంతుడు సర్వాధికుడు, కనుక ఆశ్రయించండి– అని అంటున్నారు. కానీ, మేము, అతడు సర్వాధికుడు కనుక, ఆశ్రయించడం సాధ్యం కాదని భయపడుతున్నాము" అని కొందరు అనగా, "మీరు సర్వాధికునే ఆశ్రయించాలి. ఉత్తమ పురుషార్థం సర్వాధికుని వల్లనేకదా లభిస్తుంది" అని అన్నారు, అళ్వార్లు. " తాపత్రయాతురైః అమృతత్వాయ స ఏవ జిజ్ఞాస్యః" అని అన్నారు, శ్రీ భాష్యంలో శ్రీరామానుజులుకూడా. చిన్నవాడు ఎవరు? పెద్దవాడు ఎవరు? అంటే, ఎవరు మోక్షప్రదుడో అతడే పెద్దవాడు. మోక్షాన్ని ఇచ్చేవాడు భగవంతుడు. కనుక, అతడే పెద్దవాడు. అతనినే ఆశయించాలి. ఆ విధంగా కాకుండా, వేరొక అవరదేవతను ఆశ్రయిస్తే, ఆశ్రయించేవాడు ఒక సంసారి, ఆశ్రయింపబడే దేవత కూడా ఒక సంసారి. ఇటువంటి ఆశ్రయణం అనేది "ఓట్టలోడు ఒழுకలోడమ్" వంటిది. అంటే, కొంచెం చిల్లు పడిన ఒక నావకు బాగా చిల్లుపడిన ఇంకొక నావ సహకారం చేయడంవంటిది. అమృతత్వాన్ని పొందడానికి ఒక సంసారికి ఇంకొక సంసారి ఏ విధంగా శరణం అవుతాడు? అందువల్ల, "సర్వేశ్వరుడే శరణం" అని సిద్ధాంతం. అందుచేత, అతడే జిజ్ఞాస్యుడు. అతడే ముక్తిప్రదుడు, అతడే ముక్తప్రాప్యుడు– అనేది వేదాంతసిద్ధాంతం. దానిని ఇక్కడ ఆళ్వారులు వర్ణిస్తున్నారు.

ఆ భగవానుడు సర్వాధికుడు కనుక, ముక్తిప్రదుడు కనుక, పరమేశ్వరుడు కనుక, పరాత్పరుడు కనుక, అతనిని ఆశ్రయించండి –అని అన్నారు ఆళ్వారులు. భగవంతుడు పెద్దవాడు కనుక ఆశ్రయించండి– అని మీరు అన్నారు, అతడు పెద్దవాడు కనుక ఆశ్రయించలేము– అని మేము అనుకుంటున్నాము. పెద్దవానిని ఆశ్రయించడం సులభమా? "ఏనుగు పైకి ఎక్కు "అంటే, రెండు చేతులు లేని వాడు ఏ విధంగా ఎక్కగలడు? అని అంటే, దానికి సమాధానాన్ని మూడవ దశకంలో ఆళ్వార్లు తెలియజేశారు. అవిటివాడు, కుంటివాడు ఏనుగు పైకి స్వయంగా ఎక్కలేకపోయినా, ఆ ఏనుగు తానే కింద పరుండి, తన తొండాన్ని వారికి చేయూతగా ఇచ్చినట్లయితే, ఆ ఏనుగు పైకి ఎక్కడానికి ఎవరికైనా సాధ్యమే కదా! ఆ విధంగానే నేను "చాలా గొప్పవాడు" అని చెప్పిన ఆ సర్వేశ్వరుడు చాలా సులభుడు సుమా!– అని ఆళ్వారులు "పత్తుడై" అనే మూడవ దశకంలో తెలియజేశారు. ఈ విధంగా ఆళ్వారులు తిరువాయ్ మొఴి ప్రబంధంలోని మొదటి దశకంలో భగవంతుని పరత్వాన్ని, మూడవ దశకంలో సౌలభ్యాన్ని తెలియజేశారు. మధ్యలో ఉండే "వీడుమిన్" అనే రెండవ దశకంలో భగవంతుని ఆశ్రయణీయత్వాన్ని చెప్పారు.

తిరువాయ్ మొఴి ప్రబంధంలోని "పత్తుడై" అనే దశకంలో భగవంతుని సౌలభ్యాన్ని ఉపపాదించే ఆళ్వారులు, "ఎత్తిఱమ్ ఉరలినోడు ఇణైందిరుందు ఏంగియ వెళివే" అని అంటూ శ్రీకృష్ణుని నవనీతచౌర్యవృత్తాంతాన్ని, ఆ శ్రీకృష్ణుని యశోదాదేవి రోటికి కట్టిన విషయాన్ని, అప్పుడు ఆ శ్రీకృష్ణుడు భయపడి వెక్కి వెక్కిఏడ్చిన సందర్భాన్ని స్మరించి, ఆరు నెలల కాలం మోహాన్ని పొందారు, ఆ తరువాతనే, తెలివిని తిరిగి పొంది మిగిలిన ప్రబంధాన్ని పాడారు. కానీ, బ్రహ్మ మాత్రం, ఆ విధంగా ఏ విధమైన మోహాన్ని పొందకుండా, మనసులో ప్రసన్నతను, స్వచ్ఛతను

పొంది, నిరంతరంగా శ్రీరామాయణ రచనను చేశాడు. ఆళ్వారులు జ్ఞానం పండగా ఏర్పడిన భక్తి అతిశయించి, ఆర్తి కలుగగా, దానివల్ల తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని అనుగ్రహించారు.

వాల్మీకిని అనుగ్రహించిన బ్రహ్మ దేవతాంతరం. పరిమితజ్ఞానాన్ని కలవాడు. కానీ, ఆళ్వార్లను అనుగ్రహించినవాడు పరాత్పరుడు, సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి. ఇది ఈ ఇద్దరి మధ్య ఉండే భేదం. ఈ ఇద్దరి జ్ఞానశక్తుల వ్యత్యాసాలవల్ల వీరు అనుగ్రహించిన వ్యక్తులలో కలిగిన జ్ఞానంలోకూడా వ్యత్యాసం ఉంటుంది కదా.

శ్రీరామాయణాన్ని భగవంతుడు ఆలకించినట్లే, తిరువాయ్ మొ*ళి*లి ప్రబంధాన్నికూడా విని అనుగ్రహించాడనే సామ్యం ఈ రెండు ప్రబంధాల మధ్య చెప్పినప్పటికీ, ఈ రెండిటినీ ఆలకించే క్రమాలలో చాలా తేడా ఉన్నది. భగవంతుడు శ్రీరామాయణాన్ని వినడం "తనిక్కేళ్వి", తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని వినడం "తుణైక్కేళ్వి"– అని అన్నారు, సూత్రకారులు. దీని తాత్పర్యం ఏమి? అంటే, శ్రీరాముడు వాల్మీకి రచించిన శ్రీరామాయణాన్ని సీతావిరహంలో ఉండగా, సీత తన వెంట లేకుండానే విన్నాడు. అందుచేత, అది "తనిక్కేళ్వి". – అంటే, సీత లేకుండా తానొక్కడే వినడం. "మిదిలై చ్చెల్వి ఇలకుయర్ వాయ్ త్త మక్కళ్ శెంబవళ త్తిరళ్ వాయ్ దన్ శరిదై కేట్టాన్" అని అన్నారు, దీనినిగూర్చి, కులశేఖర ప్పెరుమాళ్, తమ ప్రబంధంలో. తన చరిత్రను సీత తన పక్కనే లేకుండానే, విరహంతో శ్రీరాముడు విన్నాడు. దీనిని వాల్మీకి బాలకాండలోని నాలుగవ సర్గలో చివర తెలిపాడు.

తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని భగవంతుడు ఆలకించిన సన్నివేశం అటువంటిది కాదు. " ఇన్బమ్ పయక్క ఎ*ళి*ల్ మలర్ మాదరుమ్ తాను ఇవ్వే*ళు*లకై ఇన్బమ్ పయక్క ఇనిదుడన్ వీ*ற்ற*ిరుందు" అని అళ్వారులు అనుగ్రహించినట్లుగా,

దివ్యదేవేరులు వెంట ఉండగా, తిరువారన్ విళై అనే దివ్యక్షేత్రంలో నిత్యసూరిగోష్ఠి నడుమన, సకలపరిషత్తులో ఆనందంగా వేంచేసి ఉండి, అళ్వార్లను ఈ ప్రబంధాన్ని పాడమని చెప్పి, భగవంతుడు విన్నాడు. అందుచేత, ఇది "తుణైక్కేళ్వి. ఈ విషయాన్ని నమ్మాళ్వారులు తిరువాయ్ మొఴి ప్రబంధంలోని నాలుగవ శతకం చివరి దశకం ఆరంభ పాశురంలో తెలియజేశారు.

శ్రీరామాయణంలో మారీచుడు శ్రీరాముని పరత్వాన్ని "రామో విగ్రహవాన్ ధర్మః" అని చెప్పి, దానిని నిరూపించే శ్రీమత్త్వాన్ని "అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా" అని తెలియజేశాడు. ఇదే విధంగా, ఈ దశకంలోని మొదటి పాశురంలో ఆళ్వారులు భగవంతుని పరత్వాన్ని చెప్పారు. రెండవ పాశురంలో ఆ పరత్వాన్ని నిరూపించే శ్రీమత్త్వాన్ని చెబుతున్నారు– " మైయ కణ్ణాళ్ మలర్ మేల్ ఉఱై వాఴ్ ఉఱై మార్బినన్ శెయ్య కోల త్తడమ్ కణ్ణన్" అని అంటూ.

తిరువాయ్ మొఴి ప్రబంధాన్ని ఆలకించినప్పుడు, నారాయణుడు అనుగ్రహించాడా? లేక, తిరునారాయణుడు అనుగ్రహించాడా? అనేది ప్రశ్న. నారాయణుడు కాదు, శ్రీమన్నారాయణుడే తిరువాయ్ మొనఴి దివ్యప్రబంధాన్ని ఆలకించాడు– అనే విషయాన్ని తెలుపడం కోసం ఆళ్వారులు రెండవ పాశురంలో "మైయ కణ్ణాళ్ మలర్ మేల్ ఉఱై వాఴ్ ఉఱై మార్బినన్" అని అన్నారని వ్యాఖ్యాతలు తెలియజేశారు. ఈ విధంగా ఈ ప్రబంధాన్ని దివ్య దంపతులు ఇద్దరూ కలసి వేంచేసి ఉండి, ఆనందంగా విన్నారు. ఒకరిని ఇంకొకరు ఆనందంగా వీక్షిస్తూ, ఈ ప్రబంధాన్ని విన్నారు. తమ నేత్రాలతో తమ మనసులో కలిగిన ఆనందాన్ని ఆవిష్కరిస్తూ ఈ ప్రబంధాన్ని విన్నారు. ఈ విధంగా "నా ప్రబంధాన్ని అనుగ్రహించినవారు దివ్య దంపతులే. నా ప్రబంధానికి విషయం కూడా ఈ దివ్య దంపతులే. ఈ వీధిలో ఇద్దరూ కలసి వేంచేసి ఉండే నా ప్రబంధాన్ని విని అనుగ్రహించారు"– అనే

విషయాన్ని నమ్మాళ్వారులు “మైయ కణ్ణాళ్ మలర్ మేల్ ఉఱై వాழ் ఉఱై మార్బినన్ శెయ్య కోల త్తడమ్ కణ్ణన్” అని అంటూ తెలిపారు.

తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆలకించినప్పుడు భగవంతుడు పరమసంతోషాన్ని పొందాడు. ఈ విషయాన్ని నమ్మాళ్వారులు” శెయ్య కోల త్తడమ్ కణ్ణన్” అని అంటూ తెలిపారు. లక్ష్మీదేవిని చూచి, భగవంతుడు “ఆహా! విను లక్ష్మీదేవీ! అళ్వార్లు ఎంత అందంగా ఈ ప్రబంధాన్ని పాడుతున్నారో!” అని అంటూ తన అందమైన నేత్రాలు ఆనందంవల్ల మరింత పెద్దవి కాగా, ఆ నేత్రాలతో ఆమెను చూస్తూ అన్నాడు. అప్పుడు, ఆమె ఏమి చేసింది? “మైయ కణ్ణాళ్” అనేటట్లు, తన నల్లని, కాటుక రంగు వంటి నేత్రాలతో స్వామిని చూస్తూ, “ స్వామీ! మీరు నాకేసి చూస్తూ, ప్రబంధంలోని పాశురాలను వినడం మర్చిపోకండి. దేనిని వదిలిపెట్టకుండా వినండి” అని అన్నది– అని అంటున్నారు, ఆళ్వారులు. ఈ రీతిలో దివ్యదంపతులు పరస్పరం మిక్కిలి అభినివేశం కలవారై, పరమానందంతో అళ్వార్ల తిరువాయ్ మొழி ప్రబంధాన్ని ఆలకించారు– అనేది ఈ ప్రబంధానికి విలక్షణమైన వైలక్షణ్యం. దీనిని గమనించినప్పుడు, శ్రీరామాయణం కంటే, ఒక విధంగా తిరువాయ్ మొழி ప్రబంధం అతిశయాన్ని కలిగినది– అని చెప్పవచ్చు.

ఈ క్రమంలో శ్రీరామాయణం తిరువాయ్ మొழி– అనే ఈ రెండు శ్రీవైష్ణవ సంప్రదాయానికి ముఖ్యప్రమాణగ్రంథాలని, వీటి మధ్య పలు సామ్యాలున్నాయని, శ్రీరామాయణం కంటే తిరువాయ్ మొழிకి అతిశయం ఉన్నదని చెప్పవచ్చు.

ఇక, ఈ రెండు గ్రంథాల మధ్య ఉండే అర్థసామ్యాలను ఒకటి, రెండు ఉదాహరణలతో గమనిద్దాం.

యుద్ధంలో రావణుడు ప్రయోగించిన శక్తిప్రభావంచేత లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అతనిని ఎత్తి తీసికొని వెళ్లాలని రావణుడు అతని దగ్గరకు వచ్చాడు. తన ఎడమచేత్తో లక్ష్మణుని పైకెత్తాలని చూచాడు. సాధ్యం కాలేదు. కుడి చేత్తో ఎత్తాలని చూశాడు సాధ్యం కాలేదు. తన రెండు చేతులతో ఎత్తాలని చూశాడు. సాధ్యం కాలేదు. చేతిలో ఉండే ఆయుధాలను పక్కనపెట్టి పైకి ఎత్తాలని చూశాడు. అప్పటికి కూడా సాధ్యం కాలేదు. అప్పుడు రావణుడు తన మనస్సులో ఈ విధంగా అనుకున్నాడు. " హిమవాన్ మందరో మేరుః త్రైలోక్యం వా సహామరైః శక్యం భుజాభ్యా ముద్ధర్తుం న శంకే భరతానుజః" –" హిమవత్పర్వతాన్ని ఎత్తగలను, మందర పర్వతాన్ని ఎత్తగలను, దేవతలతో కూడిన ముల్లోకాలను కూడా భుజాలతో ఎత్తగలను, కానీ, భరతునకు తమ్ముడైన లక్ష్మణుని నేను పైకెత్తలేకున్నానే. " ఈ విధంగా అనుకున్న తరువాత రావణుడు అక్కడనుండి వెళ్లిపోయాడు. ఆ తరువాత హనుమంతుడు లక్ష్మణుని దగ్గరకు వచ్చి అవలీలగా అతనిని ఎత్తుకొని తీసికొని వెళ్ళాడు.

ఇక్కడ, ఈ సందర్భంలో, వాల్మీకి మహర్షి ఒక అద్భుతమైన శ్లోకాన్ని పలికారు. అది ఏమంటే, " శత్రూణా మప్రకంప్యో ఽ పి లఘుత్వ మగమత్కపేః" అనేది ఆ శ్లోకం. శత్రువులు అంతమంది చేరినా లక్ష్మణుని పైకెత్తలేకపోయారు. కానీ, ఒక వానరుడు అవలీలగా అతనిని పైకెత్తగలిగాడు. రావణుడు మహాబలశాలి. అయినా, పైకెత్తలేకపోయాడు. కానీ ఒక వానరుడు సులభంగా పైకెత్తగలిగాడు.

"పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్ పిఱర్ కళుక్కు అరియ విత్తకన్" (తన పట్ల భక్తిని కలిగిన దాసులకు సులభుడు. ఇతరులకు తెలియడానికి సాధ్యం కాని జగత్కారణభూతుడు.) అని అన్నారు, నమ్మాళ్వారులు.

ఇక్కడ వ్యాఖ్యానం చేస్తూ వ్యాఖ్యాత ఈ విధంగా అంటారు. "యుద్దరంగంలో లక్ష్మణుడు మోహం చెందాడు. రావణుడు తనను పైకెత్తాలని చూసిన కాలంలో తన శరీరాన్ని బరువును కలిగి ఉండేటట్లు చేసికొన్నాడా,? హనుమంతుడు తనను పైకెత్తినప్పుడు తేలిక అయ్యేటట్లు చేసుకున్నాడా? అని అంటే, దానికి అవకాశం లేదు. ఎందుకంటే, ఆ సమయంలో లక్ష్మణుడు మోహాన్ని పొందిన దశలో ఉన్నాడు. ఒకరు తనను ఎత్తాలని చూచినపుడు బరువుగాను, ఇంకొకరు ఎత్తినప్పుడు తేలికగాను తనను మార్చుకునే అవకాశం అపుడు లేదు. మరి కారణం ఎక్కడ ఉన్నది? అంటే, "పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్ పిఱర్ కళుక్కు అరియ విత్తకన్"కనుక, మనసులో ద్వేషం ఉండే రావణునకు లక్ష్మణుని ఎత్తడం సాధ్యం కాలేదు. ఎందుకంటే, " పిఱర్ కళుక్కు అరియ విత్తకన్" కనుక. మనసులో ఆనుకూల్యం ఉండే హనుమంతునకు అవలీలగా లక్ష్మణుని ఎత్తడం సాధ్యమైంది ఎందుకంటే. "పత్తుడై అడియవర్ క్కు ఎళియవన్" కనుక –అని (అంటారు వ్యాఖ్యాతలు). దీనికి అనుగుణమైన శ్రీరామాయణశ్లోకమే "శత్రూణా మప్రకంప్యో ఽ పి లఘుత్వ మగమత్కపేః" అనేది.

**ఇప్పుడు, మరి ఒక ఉదాహరణను చూడండి**

"అరుళ్ పెఱువారడియార్ తమ్మడియనేఱ్కు ఆళియాన్ అరుళ్ తరువాన్ అమైకిన్ఱాన్ " (10–6–1) అనేది తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఒక సూక్తి. ఇది తిరువాట్టాఱు దివ్యక్షేత్రంలోని స్వామిని స్తుతించే దశకంలోనిది. భగవంతుని అనుగ్రహాన్ని పొందే భక్తులు వేలాదిగా ఉన్నారు. ఆ వేలాదిమంది భక్తులకు చేసే అనుగ్రహాన్ని అంతటినీ ఆ భక్తులకు దాసుడైన నా ఒక్కని విషయంలోనే చేయాలని భావిస్తున్నాడు, భగవానుడు –అని ఇక్కడ అంటున్నారు,

ఆళ్వారులు. ఈ రస్యమైన అర్థం ఇక్కడ "అడియార్" అనే బహువచనప్రయోగంవల్ల, "అడియనేఙ్కు" అనే ఏకవచనప్రయోగంవల్ల ప్రకాశిస్తున్నది. ఇక్కడ ఆళ్వార్లు తమను గురించి నిర్దేశించినప్పుడు చేసిన "అడియనేఙ్కు" అనే ఏకవచనప్రయోగానికి, భగవద్భక్తులనుగురించి నిర్దేశించేటప్పుడు చేసిన "ఆడియార్" అనే బహువచనప్రయోగానికి తగినట్లుగా ఉండే శ్రీరామాయణంలోని శ్రీరామాయణశ్లోకాన్ని వ్యాఖ్యాతలు ఉదాహరించి చూపించారు. అది ఏమో ఇప్పుడు గమనిద్దాం.

విభీషణుడు శ్రీరాముని దగ్గరకు వచ్చి శరణాగతి చేశాడు. అప్పుడు సుగ్రీవుడు శ్రీరామునితో "శ్రీరామా! ఇతడు శత్రువైన రావణుని తమ్ముడు. అతనిదగ్గర నుంచి వచ్చాడు. రావణుడు దుష్టుడు. అందుచేత ఇతడు కూడా పరమదుష్టుడు. ఇతనిని కేవలం వధించడం కాదు చిత్రవధ చేయాలి. తీవ్రదండనను విధించాలి. కేవలం ఇతనినే కాదు, ఇతనితో వచ్చిన నలుగురు రాక్షసులను సంహరించాలి." అని అన్నాడు. ఇతని మాటలను శ్రీరాముడు విన్నాడు. తరువాత, విభీషణుని అంగీకరించాలా? వద్దా? అనే విషయంలో పలువురు తమ తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. చివరిగా శ్రీరాముడు తన సామర్థ్యాన్ని వ్యక్తం చేస్తూ "పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర!" అని అన్నాడు.

అప్పుడు "విభీషణుని తమతో చేర్చుకోవడం తగినదే" అని అంగీకరించిన సుగ్రీవుడు, "విభీషణో మహాప్రాజ్ఞః, సఖిత్వం చాభ్యుపైతు నః, అస్మాభిః తుల్యో భవతు రాఘవ!" – "ఈ విభీషణుడు మహాప్రాజ్ఞుడు, మన అందరికి స్నేహితుడు కాదగినవాడు" అని అన్నాడు. ఈ మాటను సుగ్రీవుడు పలికినట్లుగా వాల్మీకి మహర్షి శ్రీరామాయణంలో తెలియజేశాడు. ఇక్కడ సుగ్రీవుడు పలికిన "అస్మాభిః తుల్యో

భవతు” అనే మాట గమనించదగినది. “ఈ విభీషణుడు ఎవరంటే, మహాప్రాజ్ఞుడు” అని కీర్తించాడు సుగ్రీవుడు. మన పూర్వాచార్యులు ఇక్కడ మహాప్రాజ్ఞ శబ్దానికి ఏమి అర్థం? అనే విషయాన్ని చాలా అందంగా వివరించారు. ఇంతకుముందే సుగ్రీవుడు ఈ విభీషణుని అజ్ఞుడని దూషించాడు. ఇతనిని వధించి తీరాలి అన్నాడు. చిత్రవధ చేయాలి అన్నాడు. ఇతనితో వచ్చిన నలుగురితోపాటు వహించాలని అన్నాడు. కాని, ఇప్పుడు అతనిని మహాప్రాజ్ఞుడని అంటున్నాడు. ఇక్కడ ఈ విధంగా అనడంలో ఉండే స్వారస్యాన్ని నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో పరమాద్భుతంగా వివరించారు.

“రామా” నీవు వాలిని వధించాలని సంకల్పించావు. అయితే, మహాబలశాలి అయిన నీకు వాలిని వధించే సామర్థ్యం ఉన్నదా? అనే సందేహం నాకు కలిగింది అప్పుడు నేను ఏడు సాల వృక్షాలను కదిలించగలవా? పడగొట్టగలవా? అని నిన్ను అడిగాను. వాటిని నీవు ఒకే ఒక్క బాణంతో కూలగొట్టావు. (ఈ వృత్తాంతాన్ని కోరేశులు అతిమానుసస్తవం అనే గ్రంథంలో “విస్రంభయన్ సపది సాలగిరీ నవిధ్యః” అనే సూక్తితో స్తుతించారు. స్వామీ! నీవు సర్వశక్తివి. నిన్ను అడిగినవాడొక అల్పమైన వానరమృగం. అతనిని నమ్మించడం కోసంగానా, ఒక సత్యప్రతిజ్ఞను చేసి, ఇంతగా ప్రయత్నించి, సాలవృక్షాలను కూలగొట్టావు! ఆహా! అని అన్నారు). “నిన్ను శరణాగతి చేయడానికి వచ్చిన విభీషణుడు కూడా నావలెనే అజ్ఞానంతో, నీకు ఏదో ఒక పరీక్షను పెట్టి ఉండాలి కదా. కానీ, అతడు ఆ విధంగా చేయలేదు. వాలిని నీవు వధించగలవా? అని తెలిసికోవడంకోసం నీకు నేను రెండు, మూడు పరీక్షలను పెట్టాను. ఆ విధంగానే, విభీషణుడు కూడా నీకు కొన్ని పరీక్షలను పెట్టి ఉండాలి కదా. రావణుని నీవు వదించగలవా?” అని విభీషణుడు సందేహ పడి ఉంటే, అతడు ఏమి చేసి ఉండాలి? “రామా! నా అన్న రావణుడు కైలాసగిరిని కదిలించాడు, పైకెత్తాడు. ఆ విధంగానే, నీవు కూడా కైలాసగిరిని కదిలించి పైకెత్తగలవా?” అని

అడిగి ఉండాలి. కానీ, అతడు ఆ విధంగా నిన్ను ప్రశ్నించలేదు. నీకు ఏ విధమైన పరీక్ష పెట్టలేదు. నేను నీకు పరీక్షను పెట్టాను. అందువల్ల నేను మహా అప్రాజ్ఞుడను. అతడు నీకు పరీక్షను పెట్టలేదు. అందువల్ల మహాప్రాజ్ఞుడు" అని అన్నాడు, సుగ్రీవుడు– అని అంటున్నారు నంబిళ్ళై.

ఈ విధంగా సుగ్రీవుడు విభీషణుని కీర్తించడంతో ఊరుకోకుండా, "అస్మాభిః తుల్యో భవతు" అని కూడా అన్నాడు. దీని తాత్పర్యమేమి? "మాతో ఇతడు సమానం కానీ!" అని సామాన్యమైన అర్థం. విశేషమైన, రస్యమైన అర్థం ఏమంటే, " రామా నీవు వానరులమైన మా అందరి విషయంలో ఎంతటి ప్రేమను, స్నేహాన్ని చూపిస్తున్నావో, ఆ ప్రేమ, స్నేహం అంతా ఈ విభీషణుని ఒక్కనిలోనే నీవు చూపించాలి "అనేది ఇక్కడ మధురమైన అర్థం. ఇటువంటి అర్థం, ఇక్కడ, తమను అందరినీ ఉద్దేశించి సుగ్రీవుడు చేసిన "అస్మాభిః" అనే బహువచనప్రయోగంవల్ల, విభీషణుని ఉద్దేశించి చేసిన "తుల్యః" అనే ఏకవచనం ప్రయోగంవల్ల స్పష్టమవుతుంది. "నా ఒక్కని విషయంలో నీవు ప్రదర్శించే ప్రేమను మాత్రమే నీవు ఈ విభీషణుని విషయంలో నీవు చూపిస్తే చాలదు. మా వానరులందరి విషయంలో చూపించే ప్రేమను అంతటినీ ఈ విభీషణుని ఒక్కని విషయంలోనే నీవు చూపించాలి సుమా!" అనే ఇక్కడ తాత్పర్యం.

ఇదే భావం, కదా, పైన ప్రస్తావించిన తిరువాయ్ మొழி సూక్తిలోని "అరుళ్ పెరుబువారడియార్, తమ్మడియనేఱ్కు" అనే బహువచనంలోని, ఏకవచనంలోని పదాల నిర్దేశంద్వారా భాసిస్తున్నది. తనకు భక్తులైనవారు ఎంతమంది ఉన్నారో, ఎంతమంది భక్తులు తన అనుగ్రహాన్ని పొందుతున్నారో, వారికి అందరికీ దాసుడైన నా విషయంలో భగవంతుడు, వారి అందరి విషయంలో చూపించే కృపను నా ఒక్కనిలోనే చూపించడానికి సిద్ధమై ఉన్నాడు – అనే ఈ సూక్తిలోని భావంద్వారా

పై శ్రీరామాయణశ్లోకంలోని అర్థానికి, ఈ ఆళ్వారుల సూక్తిలోని అర్థానికి మధ్య ఉండే అర్థసామ్యం సుస్పష్టం.

ఈ విధంగా తిరువాయ్ మొழி ప్రబంధం ఆరంభంనుండి చివరి వరకు ఉండే వందలాది పదసందర్భాలలో స్ఫురించే శ్రీరామాయణార్థసామ్యాలను మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో పరమకృపతో అనుగ్రహించారు. వాటిని అన్నిటినీ మనం సదాచార్యానుగ్రహంతోనే పొందగలం. అటువంటి సదాచార్యుల కృపను మనం పొంది, అనుభవించి సంతోషించదగిన ఈ మహార్థాలను పొందడానికి ప్రయత్నం చేద్దాం. స్వస్తి.

★★★★★